LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM     Visit Internet Edition @ www.zaminryot.com "e-mail : editor@zaminryot.com"

# జమీన్‌రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు  సంపుటి : 71  సంచిక : 43  27.10.2000  శుక్రవారం  20 పేజీలు  విడిప్రతి : రూ.2.00లు  జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# మన నాయుడు అనిపించుకొంటేనే మంత్రిత్వానికి సార్థకత!

వెంకయ్య నాయుడు రేపు 31తేది నెల్లూరుకు రాబోతున్నారు. వొట్టి వెంకయ్య నాయుడు కాదు; కేంద్ర క్యాబినెట్ మంత్రిగా వస్తున్నారు. యాభైఏళ్ల చరిత్రలో ఒక నెల్లూరీయుడు క్యాబినెట్ మంత్రిత్వానికి ఎదగడం ఇదే ప్రథమం. నెల్లూరు నుంచి ఇద్దరు నేతలు రాష్ట్ర ముఖ్యమంత్రి పీఠం అధిష్టించారు. ఒకరు బెజవాడ గోపాలరెడ్డి, మరొకరు నేదురుమల్లి జనార్ధనరెడ్డి. కాని కేంద్రంలో క్యాబినెట్ మంత్రిత్వం మాత్రం మన జిల్లా వాసులకు అందని మానిపండు వలె వుండిపోయింది; ఆ కొరత తీర్చాడు నాయుడు.

అందువల్లే ఆయన నెల్లూరు పర్యటన బిజెపి రాజకీయ ఎల్లలకు పరిమితం కావడం లేదు. రాజకీయాలకు అతీతంగా, నెల్లూరీయుల సంబరంగా జరగ బోతున్నది. బిజెపి పార్టీలో, వారి విధానాలతో విభేదించే వారు సైతం నాయుడు గారిని స్వాగతించడానికి ఉత్సాహపడుతున్నారు. మంత్రిత్వం పొందడం ఎంత అదృష్టమో, పుట్టిన వూరిలో వర్గ విభేదాలు లేకుండా, పార్టీ వైమనస్యాలకు తావు ఇవ్వకుండా, తరతమ భేదాలు లేకుండా అందరి చేత స్వాగతం అందుకోగల్గడం అంతకంటే గొప్ప అదృష్టం. ఢిల్లీ రాజు అయినా అమ్మకు కొడుకేనని సామెత. క్యాబినెట్ మంత్రిత్వంతో వస్తున్నా - నాయుడు గారు నెల్లూరు వారికి మాత్రం మన నాయుడు క్రిందే లెక్క. నిజానికి మంత్రి నాయుడు అన్పించుకోవడం కంటే, మన నాయుడు అని పిల్పించుకోగల్గడంలోనే మాధుర్యం వుంది. పదవితో వచ్చే దర్పం, వైభవం తాత్కాలికం; ఆప్యాయతతో వచ్చే అభిమానం, ఆదరణ శాశ్వతం.

అటువంటి ప్రజాదరణ కేవలం పదవులతో రాదు; ఆ పదవుల ద్వారా చేసే మంచి పనులతో మాత్రమే అభిమానం పుట్టుకుని వస్తుంది. ఏ.సి. సుబ్బారెడ్డి గారు చనిపోయి ముప్పై ఐదేళ్లు గడిచాయి; ఇప్పటి యువకులకు ఆయన రూపం కూడా తెలియదు. కాని ఈనాటికీ జిల్లాపేరు చెప్తే ఎవరికైనా సులభంగా గుర్తుకు వచ్చే పేరు ఏ.సి. ఆయన తర్వాత, ఆయనకు ముందు చాలా మంది చాలా చాలా పెద్ద పదవులు అనుభవించారు. కాని అవేవీ జనం మనసులలో నిలువ లేదు. కేంద్ర మంత్రిగా పుట్టి పెరిగిన వూరికి వస్తున్న వెంకయ్య నాయుడు గారు గుర్తుంచుకోవల్సిన ముఖ్య విషయం ఇది.

ఇప్పటి వరకు ఆయన రాజకీయం తీరు వేరు. ఎవరో చేసిన పనులను నోటి జిల తీరే వరకు తిట్టడం మాత్రమే తెలుసు ఇంతకాలం. తన వాక్చాతుర్యంతో ఏనుగంతటి ప్రభుత్వాలను పీనుగలుగా జమకట్టి, మేరు పర్వతమంతటి నేతలను పిపీలకంగా పరిగణించి విమర్శలతో తూర్పార పట్టేవాడు నాయుడు గారు. కాని ఇక నుంచి ఆ స్వాతంత్ర్యం లేదు. ఇతరులు తనను తిట్టే పరిస్థితి రాకుండా జాగ్రత్తపడుతూ

తరువ 14వ పేజీలో

## వెంకయ్య నాయుడు స్వాగతానికి పార్టీ ఎల్లలు చెరిగిపోయాయి!

# అయ్యగారి అందలాలకు, అమ్మగారి ఆగాలు!

నెల్లూరు మున్సిపల్ రాజకీయాలు ముదుగుడు చేపల కంపు కొడుతున్నాయి. ఓటేసిన ప్రజల గురించి పాలకులు ఆలోచించడం మర్చిపోయారు. తమ రాజకీయ స్వప్రయోజనాల కోసం, అలగా జనం మాదిరి వీధినపడి కొట్టుకొంటున్నారు. నువ్వు దొంగంటే, నువ్వు దొంగని తిట్టుకుంటున్నారు. ఇంతనీచ, నికృష్ట, దరిద్ర, అసమర్థ మున్సిపల్ కౌన్సిల్‌ను నెల్లూరు ప్రజలు ఇంత వరకు చూడలేదంటే అతిశయోక్తి కాదు.

ఛైర్‌పర్సన్ అనూరాధ అధికారంలోకి వచ్చి ఆరునెలలైనా ఆవగింజంత అభివృద్ధి పనిచేయకపోగా, ఐదేళ్లకు సరిపడా ఆగం మాత్రం చేసింది. ఆమెకు, నెల్లూరు పట్టణ సమస్యలకంటే, భర్త రమేష్‌రెడ్డి రాజకీయ ప్రయోజనాలే ప్రధానంగా వున్నాయి. ఈ ఆరు నెలల కాలం, మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డితో తగాదాలకు, కౌన్సిలర్ల మధ్య చిచ్చు రేపడానికి, తెలుగుదేశం పార్టీ గ్రూపు రాజకీయాలకే ఆమె పూర్తిగా అంకితమైపోయింది.

నెల్లూరు చరిత్రలో మొట్టమొదటి మహిళా ఛైర్‌పర్సన్‌గా మంచి పాలనను అందించి చరిత్రలో నిలిచిపోతుందనుకుంటే, రచ్చలు, రావిళ్లకు పెద్ద పీటవేసి, మున్సిపాలిటీని అస్తవ్యస్తం చేసింది. మున్సిపల్ కౌన్సిల్‌ను ఆమె, తన తాత ముత్తాల ఆస్తిగా భావిస్తున్నట్లుంది. మంగళవారం నాడు జరిగిన కౌన్సిల్ సమావేశంలో అహంభావ పూరితమైన ఆమె ప్రవర్తనే ఇందుకు నిదర్శనం. షాదీ మంజిల్ ప్రారంభోత్సవ వివాదంలో వైస్ ఛైర్మన్‌పై ఆమె ప్రభుత్వానికి ఫిర్యాదు చేసిన సంగతి తెలిసిందే. ఈ నేపథ్యంలో వైస్ ఛైర్మన్ సందానిబాషా అనూరాధపై, ఆమె భర్త రమేష్‌రెడ్డిపై అవినీతి ఆరోపణలు చేశారు. భార్యా భర్తలిద్దరూ కమీషన్‌లు దండుకోవడమే పనిగా పెట్టుకున్నారని, ప్రజా సమస్యల్ని గాలికొదిలేశారని ఆరోపించారు. కౌన్సిల్ సమావేశం ప్రారంభంలో సందానిబాషా ఆరోపణలను అనూరాధ ప్రస్తావించింది. వాటిని తక్షణమే నిరూపించాలని, లేకపోతే కౌన్సిల్ సమావేశం ప్రారంభం అయ్యేందుకు వీలులేదని హుకుం జారీ చేసింది. కౌన్సిల్ బయట సందానీ చేసిన ఆరోపణల్లో నిజమెంత, అబద్ధమెంత అన్న విషయం పక్కన పెడితే, తనను తిడితే కౌన్సిల్ సమావేశం జరిగేందుకు వీలు లేదనడం ఎంత వరకు సమంజసం. ఆమె నిరంకుశ, దురహంకార ధోరణికి ఇంత కంటే ప్రత్యక్ష నిదర్శనం ఎందుకు? బయట జరిగే రచ్చలకు, కౌన్సిల్‌ను రచ్చబండచేసి నియంతలాగా వ్యవహరించడం ఎంత వరకు సమంజసం? చేతనైతే సందానీ ఆరోపణలు తప్పని రుజువు చేసుకొనే దమ్ముండాలి. లేదంటే పరువు నష్టం దావా వేసి సందానీ తుప్పు వదలగొట్టాలి. అలా కాకుండా ప్రజా సమస్యలపై చర్చించాల్సిన కౌన్సిల్ సమావేశం జరిగేందుకు వీలు లేదని ఖరాఖండిగా చెప్పడం మాత్రం దారుణం. నియంతృత్వ ధోరణికి నిదర్శనం.

## ఇంత నికృష్టపు కౌన్సిల్ నెల్లూరు చరిత్రలో లేదు!

నాలుగున్నర లక్షల జనాభా కల్గిన నెల్లూరుకు ఆమె ప్రథమ పౌరురాలు. సామాన్య కుటుంబం నుంచి టౌన్‌లో అత్యున్నత స్థాయికి ఎదిగిన అదృష్టవంతురాలు. మున్సిపాలిటీకి పెద్దగా ఉండాల్సిన స్థాయిని ఆమె దిగజార్చుకొంటుంది. ఛైర్‌పర్సన్ హోదాలో, మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి మీదనో, తనకు గిట్టని తెలుగుదేశం కౌన్సిలర్ల మీదనో, కమీషనర్‌పైనో, అధికార్లకు వ్యతిరేకంగానో నిరంతరం ప్రభుత్వానికి పిటీషన్‌లు పెట్టడమే పనిగా పెట్టుకొంది. దీనిలో భాగంగానే షాదీమంజిల్ ప్రారంభోత్సవంపై సందానీబాషాపై పిటీషన్ పెట్టి చేతులు కాల్చుకుంది. మున్సిపల్ పరిపాలనా వ్యవహారాల శాఖ కూడా "దున్నపోతు ఈనిందంటే గాటన కట్టెయ్యమన్న" సామెతగా, అనూరాధ పిటీషన్‌లోని మంచి చెడులను బేరీజు వేయకుండా సందానీకి షోకాజ్ నోటీసు ఇచ్చింది.

షాదీ మంజిల్‌ను వైస్‌ఛైర్మన్ సందానీ బాషా తనకు తెలియకుండా మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి చేత ప్రారంభోత్సవం చేయించారన్నది ఆమె ఆరోపణ. ఛైర్‌పర్సన్ సెలవు పెట్టి దిగిపోతే తప్ప వైస్‌ఛైర్మన్ పదవి ఎందుకూ కొరగాదు. అందువల్ల ఆయన సాధారణ కౌన్సిలర్ కిందనే లెక్క. షాదీమంజిల్ ప్రారంభోత్సవ కార్యక్రమంలో మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి పాల్గొంటారని జిల్లా కలెక్టర్ ఇచ్చిన అధికారిక వర్తమానం ఉంది - మంత్రి కార్యాలయం నుంచి కూడా నోట్ పంపారు. ఛైర్‌పర్సన్ అనూరాధ కూడా దాన్ని ధృవీకరించారు. ఈ కార్యక్రమంలో సందానీ తోపాటు మరో 20 మంది కౌన్సిలర్లు పాల్గొన్నారు. షాదీమంజిల్ ప్రారంభోత్సవంలో తన స్వంత రాజకీయ కారణాలతో అనూరాధ పాల్గొనలేదు కానీ, ఆ సమావేశంలో కలెక్టర్, కమీషనర్‌తో సహా కౌన్సిలర్లు, అధికారులందరూ పాల్గొన్నారు. ఈ ప్రారంభోత్సవానికి అయిన ఖర్చులను కూడా మున్సిపల్ నిధుల నుంచే వ్యయం చేశారు. కౌన్సిల్ ఎజెండాలో కూడా దీన్ని పొందుపరచి, ఆమోదం కోసం ఉంచారు. విచిత్రం ఏమిటంటే షాదీమంజిల్ ప్రారంభోత్సవానికి అయిన ఖర్చును కౌన్సిల్ ఆమోదానికి ముందే ఛైర్‌పర్సనే స్వయంగా మంజూరు చేసింది. వాస్తవాలన్నీ రికార్డు పూర్వకంగానే ఉండగా, అబద్ధాలతో పిటీషన్లు పెట్టి ప్రత్యర్థులను వేధించాలను కోవడం అవివేకం. పట్టణ ప్రథమ పౌరురాలు ఆమె చెయ్యాల్సిన పని కాదు - ఇది ఛైర్‌పర్సన్ స్థానానికే తలవంపులు తెచ్చే చర్య. ఆమె పెట్టె పిటీషన్‌లు ఏదో, నెల్లూరు అభివృద్ధి కోసం పెడితే బాగుంటుంది. షాదీమంజిల్ వివాదంలో తనను అనవసరంగా రచ్చకీడ్చడంతో ఆదాల ప్రభాకరరెడ్డి అగ్గిమీద గుగ్గిలమై ఉన్నాడు. ఛైర్‌పర్సన్ అనూరాధ తనను స్వయంగా షాదీమంజిల్ ప్రారంభానికి పిలిచి దీన్ని రాజకీయ రాద్ధాంతం చేయడంతో ఆయన విస్తుపోయాడట.

స్వంత పార్టీకి చెందిన మంత్రితో వివాదం, ఎమ్మెల్యే వివేకాతో తగవు, కౌన్సిల్లో ఉన్న 44 మంది కౌన్సిలర్లలో

కొరవ 19వ పేజీలో

# వ్యవసాయంపై నిర్లక్ష్యం

రాష్ట్రంలో రైతుల పరిస్థితి రాను రాను దుర్భరంగా మారుతున్నది. భూమిని నమ్ముకొని బ్రతకడం నేరంగా పరిగణించే రోజులు వస్తున్నాయి. వ్యవసాయ ఆధారిత సమాజం మనది. నూటికి 70 మంది ప్రజలు ఈనాటికీ గ్రామాలలోనే బ్రతుకుతున్నారు. మన పల్లెటూళ్లలో సేద్యం తప్ప వేరొక వ్యాపకం లేదు. ప్రధానమైన పరిశ్రమలన్నీ మహానగరాలలోనే ఏర్పడినాయి ఇంతకాలం. అందువల్ల గ్రామాలలో పుట్టే ప్రతి మనిషి భూమిపై ఆధారపడి బ్రతకడం తప్ప మరొక మార్గం మాత్రం లేదు. అందువల్లనే స్వాతంత్ర్యానంతర ప్రణాళికలన్నీ వ్యవసాయాభివృద్ధికి పెద్ద పీట వేశాయి. జవహర్‌లాల్ నెహ్రూ పెద్ద పెద్ద ఇరిగేషన్ ప్రాజెక్టులు నిర్మించారు. భాక్రానంగల్, నాగార్జునసాగర్ వంటివి నెహ్రూ దూరదృష్టి పుణ్యమే. ఇందిరాగాంధీ హరిత విప్లవం ప్రకటించి వ్యవసాయ రంగంలో నిజమైన విప్లవం తీసుకొని వచ్చారు. కొత్త కొత్త వరి, గోధుమ వంగడాలు ప్రవేశపెట్టి, దిగుబడులు పెంచి దేశంలో ఆహార కొరత లేకుండా చేసింది ఇందిరమ్మ. వ్యవసాయ పరిశోధన ఆమెకెంతో ప్రీతిపాత్రమైన కార్యక్రమం. అందువల్లనే దేశంలో ఆకలి చావులు దాదాపుగా సమసిపోయాయి. గ్రామాలలో పేదరికం తొలగకపోయినా తిండికి, బట్టకు లోటు లేకుండా రైతులు వ్యవసాయాన్ని నమ్ముకుని జీవించే పరిస్థితులు ఏర్పడ్డాయి. కాని ఇప్పటి ప్రభుత్వాల దృష్టి మారిపోయింది. కంప్యూటర్ మాయాజాలంపై మోజు, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ వ్యామోహం, వినిమయ సంస్కృతిపట్ల ఆరాధన, పరిపాలనలో పట్టణీకరణ వంటి మార్పులు ప్రభుత్వ ప్రాధాన్యతలను మార్చి వేస్తున్నాయి. ఈ కొత్త పిచ్చిలో వ్యవసాయం పాత ఒక రోత పనిలా తయారౌతున్నది. ఈ మార్పు వల్ల కల్గే దుష్ప్రభావాలు అప్పుడే ప్రజల జీవితాలను ప్రభావితం చేస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఈ సంవత్సరం సేద్యం చేసే పరిస్థితి లేదు. మొవ్వ కుళ్లు తెగులు నివారించడం అలవి కావడం లేదు కాబట్టి వేరుశనగ పంట వేయవద్దని రైతులకు ఉచిత సలహా ఇస్తున్నారు వ్యవసాయ శాస్త్రవేత్తలు. ప్రత్తి పంట ప్రమాదకరం అని ప్రకటించింది వ్యవసాయశాఖ. మాగాణుల్లో వరి వంటి పైర్లు సాగుచేస్తే కరెంట్ ఇవ్వలేమని అందువల్ల రైతులు అరుతడి పంటలు సాగు చేసుకోవాలని తేల్చి చెప్పింది విద్యుత్ బోర్డు. పొగాకు సాగు చేస్తే గిట్టుబాటు ధర వచ్చే అవకాశం లేదు కాబట్టి క్రాప్ హాలిడే అంటున్నారు. కొబ్బరి తోటల పరిస్థితి హీనంగా తయారయ్యింది. శ్రీలంక నుంచి చాల చౌకధరకు టెంకాయలు దిగుమతి అవుతుండడంతో కొబ్బరి తోటల పెంపకం నష్టదాయకంగా మారింది. నూనె గింజల దిగుమతి అనుమతించడం వల్ల పామోలివ్, ఆముదం, పొద్దుతిరుగుడు పువ్వుల సాగు రైతును దివాలా తీయిస్తున్నాయి. చెరకు రైతులు చక్కెర ఫ్యాక్టరీ యాజమాన్యాల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి బ్రతకవల్సిన దుస్థితిలో పడిపోయారు. ఈ పరిస్థితిలో రైతులు ఏ పంట సాగు చేయాలి; జీవనం ఎట్లా సాగించాలి? రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు రెండూ వాస్తవిక పరిస్థితులను పరిగణనకు తీసుకోకుండా ప్రపంచ బ్యాంకు, వరల్డ్ ట్రేడ్ ఆర్గనైజేషన్ వంటి విదేశీ సంస్థలు, మెకన్సీ వంటి విదేశీ కన్సల్‌టెంట్ల సలహాలతో పరిపాలన చేస్తుండడమే ఈ నికృష్ట పరిస్థితికి కారణం. విదేశీ సంస్థలకు కావాల్సింది తమ దేశాల ఉత్పత్తులకు మార్కెట్ మాత్రమే. తమ డబ్బు అధిక వడ్డీలకు మార్చుకోవడం ప్రపంచ బ్యాంకు లక్ష్యం. వారు ఇచ్చే ప్రతి సలహా, చేసే ప్రతి ఒప్పందం, విధించే ప్రతి షరతు పాశ్చాత్య దేశాల సంక్షేమం వాంఛించేవి తప్ప మన వంటి వర్ధమాన దేశాల ప్రయోజనం ఆశించేవి కావు. కాని దురదృష్టవశాత్తు ఇటు మన ముఖ్యమంత్రి చంద్రబాబు, అటు మన ప్రధాన మంత్రి వాజ్‌పాయి అమెరికా మోజులో పడిపోయి వున్నారు. విదేశీ సంస్థల స్వార్థం గ్రహించకుండా వారి ఆదేశాలను పాటిస్తున్నారు. ఫలితం ఈనాటి విషమ పరిస్థితి. ప్రణాళికలలో వ్యవసాయాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేయడం వల్ల కొత్త నీటి పారుదల ప్రాజెక్టుల నిర్మాణం నిల్చిపోయింది. కొత్త విద్యుత్ కర్మాగారాలు నెలకొల్పడం లేదు; కొల్లు, పాడి వంటి గ్రామీణ పరిశ్రమలు పతనమై పోతున్నాయి. గత రెండేళ్లలో రాష్ట్రంలో స్టేట్ హైవే రోడ్ల కోసం 1800 కోట్లు ఖర్చు పెట్టారు. ఇవంతా ప్రపంచ బ్యాంక్ ఇచ్చిన అప్పుతో వేసిన రోడ్లు. కాని వాటి వల్ల రాష్ట్ర ప్రజలకు కల్గుతున్న ప్రయోజనం శూన్యం. కడప - తాడిపత్రి రోడ్డు కోసం రెండు వందల కోట్లు వెచ్చించారు. కాని ఆ రోడ్లలో గంటకు ఒక వాహనం కూడా తిరగదు. ఇదే 1800కోట్లు నీటి పారుదలకు వెచ్చించి వుంటే తెలుగుగంగ ప్రాజెక్ట్ పూర్తి అయి వుండేది. కడప, కర్నూలు, నెల్లూరు, చిత్తూరు జిల్లాలు నాల్గింటిలో ఐదు లక్షల ఎకరాలు కొత్తగా సాగులోకి వచ్చి వుండేవి. ఈ డబ్బు విద్యుత్ కర్మాగారాలకు వుపయోగ పెట్టి వుండినా 500 మెగావాట్ల కరెంట్ ఉత్పత్తి జరిగేది. రైతులకు కోరినంత కరెంట్ ఇచ్చే వీలు కల్గేది. ప్రభుత్వం తన పరిపాలనా ప్రాధాన్యతలు ఇష్టం వచ్చినట్లు మార్చుకుని, తెచ్చిన అప్పులు రోడ్లు, ఫ్లైఓవర్లు; కంప్యూటర్లు, పత్రికా ప్రకటనలకు ఖర్చు చేస్తుండడం వల్ల రాష్ట్రంలో వ్యవసాయం కొన్ని దశాబ్దాలు వెనక్కు తిరోగమించింది. గత పదేళ్లలో మన వ్యవసాయ పరిశోధనాశాలలు ఒక్క కొత్త వరి వంగడం తయారు చేయలేదు. పంట దిగుబడులలో ఏ మాత్రం పురోగతి లేదు. కొత్తగా ఒక్క ఎకరాకు నీటి పారుదల కల్పించలేదు. ప్రపంచం యావత్తు జెనెటిక్ ఇంజనీరింగ్ వంటి ఆధునిక ప్రక్రియలలో తమ వ్యవసాయాన్ని ప్రగతి పథంలో పయనింప చేస్తుంటే మన రాష్ట్ర ప్రభుత్వం మన వ్యవసాయ పరిశోధనా సంస్థలను మూతవేసే పరిస్థితికి తీసుకుని వస్తున్నది. ఈ ఏడాది వేరుశనగ, పత్తి పంటలు వేసిన రైతులు దాదాపు 150 మంది ఆత్మహత్యలు చేసుకున్నారు; చాలా రైతు కుటుంబాలలో వయస్సులో వున్న ఆడపిల్లలు తమకు పెళ్లి కాదనే దిగులుతో తమ ప్రాణాలు తామే తీసుకుంటున్నారు. కాలేజి చదువులు భరించే ఆర్థిక స్తోమత లోపించడమే ఇందుకు కారణం. ఎప్పుడో ముప్పైఏళ్ల క్రితం మర్చిపోయిన ఆకలి చావులు ఈ ఏడాది మహబూబ్‌నగర్‌లో సంభవించాయి. బ్రిటిష్ కాలం నాటి వలె గంజి కేంద్రాలు నడపవల్సి వచ్చింది. రాష్ట్రంలో వ్యవసాయ రంగ పతనావస్థకు ఇంత కంటె సూచనలు అవసరం లేదు. కాని ప్రభుత్వంలో మాత్రం కొద్దిగా కూడా చలనం రావడం లేదు. చంద్రబాబు తన కంప్యూటర్ మోజు, విదేశీ వ్యామోహం వదలి; కలల ప్రపంచం వీడి నేల మీద నిలబడి ఆలోచించ వల్సిన పరిస్థితులు ఇవి. గ్రామాల లో పేద రైతులు తిండికి అగచాట్లు పడుతున్నప్పుడు; నీళ్లు, కరెంట్ లేక లక్షల ఎకరాల భూమి బీడు పెట్టవల్సిన దుస్థితి ఏర్పడినప్పుడు; పంటలకు సోకే పురుగు నివారణకు మందు సూచించలేని దౌర్భాగ్య స్థితిలో వ్యవసాయ పరిశోధనాశాలలు మగ్గుతున్నప్పుడు - ప్రజలకు కావాల్సింది స్వర్ణాంధ్ర స్వప్నం కాదు; చైనాలో ఫ్లైఓవర్ నిర్మాణం తీరు కూడా కాదు. రాష్ట్రం ప్రగతి చంద్రబాబు నిజమైన లక్ష్యం అయితే తక్షణం ప్రభుత్వ ప్రాధాన్యతలలో వ్యవసాయానికి ప్రథమ స్థానం ఇవ్వాలి. గ్రామాలలో నీరు లేక, కరెంట్ లేక ఒక్క ఎకరా కూడా బీడుగా పెట్టవల్సిన అవసరం లేని పరిస్థితి కల్పిస్తే నిజమైన ప్రగతి సాధ్యమౌతుంది. కల్లబొల్లి కబుర్లు, అరచేతిలో స్వర్గం చూపే కట్టుకథలు, ప్రగతి కలలతో ప్రజలను మభ్యపెట్టి పరిపాలన చేయడం ఇకనైనా మానుకోకపోతే గ్రామాలు స్మశానాలుగా మారుతాయి. రాష్ట్రం వెనక్కు తిరోగమిస్తుంది. రైతు సంస్థలు, మేధావులు ప్రభుత్వం కళ్లు తెరిపించేందుకు పూనుకోవాల్సిన సమయం ఇది. *

---

## జమీన్‌రైతు 27.10.50

వెల: 0-3-0 పేజీలు: 12

### రంగాగారి నుండి ప్రకాశం బృందం చీలిపోతుందా?

ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు 23తేది మెయిల్లో నెల్లూరు వచ్చారు. టి.బి.లో విడిది చేశారు. ముత్తరాజు గోపాలరావు, కటికనేని కళ్యాణరావు, దివి కొండయ్య, వెంకటరత్నం ప్రభృతులు పంతులుగారిని కలుసుకొని నియోజక వర్గాల విభజనలో జరిగిన లోపాలను గూర్చి చెప్పుకొన్నారట. బత్తిన రామకృష్ణారెడ్డి, జిల్లా కాంగ్రెస్ అధికార వర్గాలుగాని పంతులుగారిని కలుసుకొన్నట్టు లేవు. పంతులు గారు వచ్చిన వారితో ఇష్టాగోష్ఠిగా సంభాషించడంతో ప్రస్తుతం మంత్రివర్గంపై తనకున్నపాత క్రోధాన్ని తిరుగావెళ్లగ్రక్కుతూ, కళాను కార్యదర్శిగా తీసుకోవడంలో టాండన్ మీద పెట్టుకొన్న ఆశలన్నీ అడియాసలయ్యాయని రంగాగారు కార్యవర్గంలో చేరకుండా నిరాకరించి వుండవలసినదని, అందువల్లనే రంగాగారితో తన పార్టీ సహకారపు ఆశ మొగించుకోమని చెప్పి వచ్చానని. 26తేది మద్రాసులో జరిగే సమావేశ ముఖ్యవుద్దేశ్యం కళా వెంకట్రావు దర్శకత్వం నుండి తొలగించుటకు ఆందోళన గావించడం. లేని ఎడల రంగాగారిని కార్యవర్గం నుండి వైదొలగి రమ్మని కోరుటకు, మరి ఇతర సమస్యలు చర్చించుటకని చెప్పారని తెలుస్తున్నది.

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

పంతులు గారు 24తేది ఉదయం మద్రాసు పోయారు.

### ఐక్యరాజ్య సమితి మనుగడ ప్రశ్నార్థకం?

అమెరికా కూటం, రష్యా కూటం - ఈ రెండు కూటాల కూట చర్యలకు సమితి ఒక 'గోదాం'గా మారిపోయి, అది ప్రపంచ భవిష్యత్తును తీర్చిదిద్దడం పట్ల గల తన విద్యుక్తాన్ని విస్మరించి పోయింది. ఫలితంగా అసమర్థత, అ

తరువాయి 10వ పేజీలో

---

## జనవాణి

# వినాశనమే ఆర్.ఎస్.ఎస్. లక్ష్యమా?

నాగపూర్‌లో జరిగిన ఆర్ఎస్ఎస్ వార్షికోత్సవాల సందర్భంగా ఆర్ఎస్ఎస్ నాయకులు మాట్లాడిన మాటలు దేశప్రజలకు తూటాలు మాదిరి గుచ్చుకొన్నాయి. మతతత్వాన్ని రెచ్చగొట్టడం, చర్చిలు దేశంలో ఉండ తగవనడం, ముస్లింలూ ఒకప్పుడు హిందూవులే అనడం చూస్తుంటే ఆర్ఎస్ఎస్‌కు హిందూత్వ పిచ్చి ముదిరిందని పిస్తుంది. భారతదేశం ప్రజాస్వామ్య దేశం. ఎన్నో మతాలు, కులాలు, వర్గాల ప్రజలు కలిసిసహజీవనం సాగిస్తుంటె ఆర్ఎస్ఎస్ కులతత్వాన్ని రెచ్చగొట్టి దేశాన్ని అస్థిరత వైపు నడిపించాలనుకోవడం చాలా పొరపాటు. ఈ కార్యక్రమానికి హోంమంత్రి, ఎల్.కె.అద్వానీ హాజరవ్వడం చూస్తే బిజెపికి రహస్య ఎజెండా వున్నదనే విషయం బయటపడుతుంది.

*గంగవరం* *జి.రామకృష్ణప్రసాద్*

### పురుగు మందు సీసా- రైతులకు నరకానికివీసా!

గత ఏడాది తెలంగాణా రైతులు పత్తి పంట దెబ్బతిని గత్యంతరం లేక పురుగు మందు తాగి ఆత్మహత్యలు చేసుకొన్నారు. వ్యక్తిగత కారణాలతో రైతులు ఆత్మహత్యలు చేసుకొన్నట్లు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రకటించారు. ప్రస్తుతం అనంతపురం జిల్లాలో వేరుశనగ పైరు దెబ్బ తింటె అంతా అయిపోయిన తర్వాత ప్రభుత్వం స్పందించి రైతులకు పురుగు మందులు పంచింది. అది త్రాగి ఆ జిల్లాలో రైతులు కూడా ఆత్మహత్యలు చేసుకొన్నారు. అదే విధంగా గూడూరు దగ్గర ఒక పల్లెలో రైతులు తమ పొలాలకు నీరు అందడం లేదని, నీరన్నా ఇవ్వండి లేక పోతే పురుగుల మందైనా ఇవ్వమని అక్కడి ఎమ్మెల్యేను నిలదీశారు. ఇది ప్రస్తుతం రాష్ట్రంలో రైతుల పరిస్థితి. రైతులను ఆదుకొనే ప్రభుత్వాలు లేకపోయినా, చీడ, పీడలను వదలించను తయారు చేసిన పురుగు మందులు రైతులను ఆదుకొంటున్నాయి.

*కోవూరు* *వెవిశ్వేశ్వరరావు*

### రాష్ట్రంలో చెక్‌పోస్టులను తీసివేయాలి

రాష్ట్రంలో వున్న వాణిజ్య పన్నుల చెక్‌పోస్టులను వెంటనే తీసివేయాలి. ఈ చెక్‌పోస్టులు వ్యాపారస్తులను వేధించడం కోసమే ఉపయోగపడుతున్నాయి. మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాలు చెక్‌పోస్టులను రద్దు చేయడాన్ని, ఉత్తరప్రదేశ్‌లో బార్డర్‌లో చెక్‌పోస్టులను తొలగించడాన్ని ప్రభుత్వం గుర్తించాలి. ఇటీవల రాష్ట్ర వాణిజ్య శాఖామంత్రి ఒక సభలో మాట్లాడుతూ ఐదు సంవత్సరాలుగా రిజిస్ట్రేషన్ పొందివున్న వ్యాపారస్తులకు ఏ విధమైన ఆంక్షలు విధించక వెబిల్స్, సి-ఫారాలు జారీ చేస్తామన్నారు. పన్నులు వివాదంలో రావలసిన బాకీలను దండడానికి తమిళనాడు తరహాలో మన రాష్ట్రంలో కూడా సమాదాన్ పద్ధతి ప్రవేశపెట్టాలి. పన్నుల వసూళ్లలో వాణిజ్య పన్నుల శాఖ అనుసరించే వైఖరిపట్ల జనం

తరువాయి 10వ పేజీలో

# విమర్శలు - ఆరోపణలు - నిష్టూరాలు

కొండావీధిలో జూలై నెలలో జిల్లామంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి ప్రారంభించిన షాదీ మంజిల్ వ్యవహారంపై వైస్‌ఛైర్మన్ సందానిబాషా అందుకొన్న షోకాజ్ నోటీసుపై చర్చించనే 24తేది జరిగిన మునిసిపల్ సమావేశం పరిమితమయ్యింది. మున్సిపల్ ప్రాంగణంలో 144 సెక్షన్ విధించి, భారీ పోలీసు బందోబస్తు మధ్య కౌన్సిల్ సమావేశం జరిగింది. సందానిబాషాకు వచ్చిన షోకాజ్ నోటీసును ఉపసంహరింపజేయాలని అన్ని పార్టీల కౌన్సిలర్లు మునిసిపల్ ఛైర్మన్‌ను కోరారు. ఈ

## కౌన్సిల్ సమావేశం తీరూ - తెన్నూ

వ్యవహారంపై చర్చ జరుగుతున్నప్పుడు కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల కౌన్సిలర్లు ఎప్పటి మాదిరి రెట్టించుకొన్నారు. సమావేశం దారి మళ్లుతున్నదన్న అనుమానంతోనేమో భారీ పోలీసు బందోబస్తు ఏర్పాటయ్యింది. గంట ఆలస్యంగా సమావేశం ప్రారంభంకాగానే ఛైర్మన్ తాళ్లపాక అనూరాధ మాట్లాడుతూ అధికారంలోకి వచ్చి ఐదు నెలలవుతున్నా చిన్న అభివృద్ధి పనులు కూడా చేయలేక పోయాం. త్వరలో 32కోట్లు డిఎఫ్‌ఐడి నిధులు రాబోతున్నాయి. అందరూ సహకరిస్తే పట్టణాన్ని అభివృద్ధి పరచగలం. నేను అధికారం లోకి వచ్చాక అవినీతికి పాల్పడినట్లు వైస్ ఛైర్మన్ ఈ మధ్య పత్రికల వారికి చెప్పారు. అవేమిటో చెబితే వాస్తవాలైతే తక్షణం రాజీనామా చేస్తాను. లేకుంటే వైస్ ఛైర్మన్ సభలో క్షమాపణ చెప్పాలి. అప్పుడుగాని అజెండాలోకి వెళ్లనన్నారు. కో ఆప్షన్ సభ్యుడు చాట్ల నరసింహారావు చర్చలో జోక్యం చేసుకొంటూ షాదీ మంజిల్‌లోకి వైస్ ఛైర్మన్ అక్రమంగా జొరబడి, స్వంత ఎస్టేట్‌లా భావించి ప్రారంభింపజేశారని ఛైర్మన్ ప్రభుత్వానికి ఫిర్యాదు చేశారు. కానీ ఈ వ్యవహారంలో మొదటి నుంచి చివరి వరకు జరిగిన ప్రతి వ్యవహారంలో ఛైర్మన్ ప్రమేయముంది. కానీ వైస్ ఛైర్మన్‌పై ఫిర్యాదు చేయడం భావ్యం కాదని, దీన్ని ఉపసంహరించుకోవాలని కోరారు.

చాట్ల నరసింహారావు మాటలకు తెలుగుదేశం కౌన్సిలర్ కిలారి వెంకటస్వామి అడ్డు తగులుతూ ప్రత్యేక అర్హతలుగల సభ్యునిగా ఎన్నికైన నరసింహారావు ఒక పార్టీకి అనుకూలంగా మాట్లాడడం బాగోలేదన్నారు. ఊటుకూరు లక్ష్మయ్య మాట్లాడుతూ మునిసిపాలిటీలో జరుగుతున్న ప్రారంభోత్సవాలన్నీ కౌన్సిల్ ఆమోదంతోనే జరగడం లేదన్నారు. మంచి మనసుతో వైస్ ఛైర్మన్‌కు ఇచ్చి నోటీసును ఛైర్మన్ రద్దు చేయించాలని కోరారు. తెలుగుదేశం పార్టీ విప్ ధర్మవరపు సుబ్బారావు మాట్లాడుతూ ఛైర్మన్‌పై చేసిన అవినీతి ఆరోపణలపై చర్చ జరగాలన్నారు. ఇండిపెండెంట్ సభ్యుడు సురేష్ మాట్లాడుతూ షాదీ మంజిల్ వ్యవహారం వివాదాస్పదమైనప్పుడు కమీషనర్ ఈ విషయాన్ని కలెక్టర్‌కు తెలియజేసి వుండాల్సిందన్నారు. నిత్యం జరుగుతున్న ఛైర్మన్, వైస్ ఛైర్మన్ గొడవలతో కౌన్సిల్ పరువు పోతున్నాదన్నారు. నర్తు బాటు ధోరణే షోకాజ్ నోటీసు సమస్యకు పరిష్కారమన్నారు. తెలుగుదేశం కౌన్సిలర్ శ్రీధరకృష్ణారెడ్డి మాట్లాడుతూ షాదీ మంజిల్ కార్యక్రమానికి 30 మంది కౌన్సిలర్లు వెళ్లారు. వీరందరికీ రాని షోకాజ్ నోటీసు వైస్ ఛైర్మన్‌కు రావడం భావ్యం కాదన్నారు. మునిసిపల్ పాలన అస్తవ్యస్తమై పోయింది. లైట్లు కాలిపోతే

## నెల్లూరుసంగతులు

వెంటనే వేయించ లేకపోతున్నాం. మునిసిపల్ శానిటరీ ఉద్యోగులపై పర్యవేక్షణ లేదు. చేయగల పనులకే ఎస్టిమేషన్లు వేయిస్తే బాగుంటుందన్నారు. చర్చలో అనూరాధ జోక్యం చేసుకొంటూ షోకాజ్ నోటీసు వచ్చింది సందానీబాషాకు; వివరణ ఆయనే పంపుకోవాలి. ఈ విషయం తానేమీ మాట్లాడనన్నారు. సిపిఎం పక్ష నాయకుడు చంద్రశేఖర్‌రెడ్డి మాట్లాడుతూ టౌన్‌లో పేరుకపోయిన మునిసిపల్ చెత్తమాదిరి - సమావేశాన్ని కూడా చెత్త చేయవద్దన్నారు. కపాడిపాలెం కౌన్సిలర్ బైరాజ్ అట; మీసాలు మెలేస్తూ అభ్యంతరకరమైన భాషలో

తరువ 19వ పేజీలో

# మేం అవి'నీతి మంతులం'

సమస్త ప్రభుత్వ శాఖలు అవినీతి మయమైనప్పుడు తమలోని అవినీతిని ప్రత్యేకంగా ప్రస్తావిస్తే ఒప్పుకోమన్నారు మునిసిపల్ అధికారులు. అతిముఖ్యమైన మునిసిపల్ అజెండాపై చర్చ జరుగుతున్నప్పుడు అవినీతి తమ జన్మహక్కంటూ సమావేశాన్ని బహిష్కరించి వెళ్లి అందరూ ఆశ్చర్యపడేలా చేశారు. 24తేది మునిసిపల్ సమావేశంలో తెలుగుదేశం కౌన్సిలర్ నూనె మల్లిఖార్జునయాదవ్ మాట్లాడుతూ నెల్లూరు టౌన్ ప్లానింగ్ అధికారులు అవినీతిపరులై పోయారు. లంచాలు తీసుకొని అక్రమకట్టడాలను అనుమతిస్తున్నారు. గత ఏడాది అక్రమ కట్టడాల క్రమబద్ధీకరణ ద్వారా 59 లక్షలొస్తే ఈ యేడాది 29లక్షలే రావడానికి కారణమేమిటో టౌన్‌ప్లానింగ్ అధికారులు చెప్పాలని నిలదీశారు. దీనికి కమీషనర్ వేమారెడ్డి బ్రహ్మాండమైన సమాధానం చెప్పారు. మున్సిపల్ అధికారులు లంచాలు తీసుకొంటున్నారని సభలో ప్రస్తావించాల్సిన అవసరం లేదు. లంచాలనేవి ప్రతి శాఖలో వుంటాయి. అవినీతి అన్ని చోట్లా వుందని పార్లమెంటు సైతం ఒప్పుకొంది. మునిసిపాలిటీలో అవినీతి కొంత మేర వుండవచ్చని సభలోనే చెప్పారాయన. ఎంత మేర వుంటుందని సభ్యులు ప్రశ్నించడంతో తమను అవమానపరుస్తున్నారంటూ అధికారులందరూ తమ సీట్లలోంచి వెళ్లిపోవడం అందర్నీ ఆశ్చర్యపర్చింది. ఈ విషయమై కమీషనర్ వ్యవహరించిన తీరుపై ప్రభుత్వానికి తెలియజేస్తానని మునిసిపల్ ఛైర్మన్ అనూరాధ విలేఖరులకు చెప్పారు. జీతాలు కాకుండా లక్షలకు లక్షలు లంచాలు తింటూ అది ప్రస్తావిస్తే సభను బహిష్కరించడం చోద్యంగా వుంది.

## మెడికో లీగల్ సర్టిఫికేట్ల కోసం పడిగాపులు

మెడికో లీగల్ కేసులో ప్రభుత్వ ఆసుపత్రి డాక్టర్ ఇచ్చే మెడికల్ సర్టిఫికెట్ల కోసం జిల్లాలోని వివిధ పోలీసు స్టేషన్ల

## మున్సిపల్ అధికార్ల వింత నిరసన

నుంచి వచ్చే కానిస్టేబుళ్లు పెద్దాస్పత్రి వద్ద పడిగాపులు కాస్తున్నారు. మెడికో లీగల్ కేసులకు సంబంధించిన సర్టిఫికేట్లను వైద్యులు ఇస్తే, పోలీసులు వాటిని తీసుకొని ఛార్జిషీట్ పెడతారు. ఈ సర్టిఫికేట్లు తెచ్చి ఇవ్వను ప్రతి పోలీసు స్టేషన్ నుంచి ఒక కానిస్టేబుల్‌ను నియమించి వుంటారు. కాని నెలల తరబడి పెద్దాసుపత్రిలో ఈ సర్టిఫికేట్లను ఇవ్వడం లేదు. దీంతో అసలు విషయం తెలుసుకొని పోలీసు ఉన్నతాధికారులు తమకు ఛార్జ్ మెమోలిస్తున్నట్లు పోలీసులు లబోదిబో మంటున్నారు. ఎం.ఎల్.సి. కేసుల్లో సర్టిఫై చేయడానికి

తరువ 19వ పేజీలో

# వెంకయ్యకు సన్మానం - మాకెంతో ఆనందం



నాటి మా కాలేజి విద్యార్థి
నేటి దేశ రథసారథి
ప్రజలకు ప్రభుతకు
మధ్య సమర్థ వారథి
ప్రియతమ కేంద్ర మంత్రివర్యులు

## శ్రీ వెంకయ్య నాయుడు గారిని

ఉప్పొంగిన ఆనందంతో,
ఉద్వేగ భరిత విజయ గర్వంతో
స్వాగతిస్తున్నాం సన్మానిస్తున్నాం.

వి.ఆర్. కళాశాల పూర్వ విద్యార్థులకు,
ప్రజలకు ఇదే మా ఆహ్వానం

కార్యక్రమం :
1.11.2000 తేది బుధవారం
సాయంత్రం 4.00 గంటలకు
**వి.ఆర్. కళాశాలలో ఘన సన్మానం**

ముఖ్య అతిథులు :

**శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి**
మాజీ ముఖ్యమంత్రి

**శ్రీ గునుపాటి వెంకటకృష్ణా రెడ్డి**
ఛైర్మన్, జి.వి.కె. ఇండస్ట్రీస్

**శ్రీ సి. రఘువీరప్రసాద్**
ఛైర్మన్, గ్యాస్ అథారిటీ ఆఫ్ ఇండియా

**శ్రీ ఆనం భక్తవత్సల రెడ్డి**

**- వి.ఆర్. కళాశాల పూర్వవిద్యార్థులు**
మరియు
**కళాశాల కమిటీ**

# దీక్షా దక్షతలే వెంకయ్య ఉన్నతికి సోపానాలు

స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత ఆధునిక భారత రాజకీయాలలో రూపుదిద్దుకున్న కొత్తతరం నాయకులలో వెంకయ్యనాయుడు ఒకరు. నెల్లూరు జిల్లా వెంకటాచలం మండలంలోని చవట పాళెం గ్రామంలో సామాన్య రైతు కుటుంబంలో జన్మించిన ముప్పవరపు వెంకయ్య నాయుడు తన వాడి... వేడి... బాణిని వినిపిస్తూ గ్రామీణ ప్రాంతం నుంచి కేంద్ర గ్రామీణ శాఖ మంత్రిదాకా స్వశక్తితో ఎదిగిన సింహపురి ముద్దుబిడ్డ. విద్యార్థి దశనుంచే రాజకీయ సామాజిక తత్వాన్ని జీర్ణించుకొనితన దైన శైలిలో ముందుకు దూసుకుపోవడం ఆయన ప్రత్యేక లక్షణం. 1949లో జన్మించిన నాయుడు విద్యార్థి దశ నుంచే సంఘ స్వయం సేవక్‌గా పనిచేశారు. ఆర్.ఎస్.ఎస్ ప్రచారక్ బోగాలి దుర్గాప్రసాద్ ప్రభావం నాయుడు మీద ఎంతగానో పని చేసింది. రాజకీయాలలో ఉద్యమాల వైపు ఆసక్తి చూపేవారు. నెల్లూరు వి.ఆర్ కళాశాల ఎబివిపి విద్యార్థి నాయకునిగా, విశాఖపట్టణంలో ఆంధ్ర యూనివర్సిటీ 1972 - 73 సంవత్సరాల్లో విద్యార్థి యూనియన్ ఛైర్మన్‌గా, 1973-74లో ఎబివిపి రాష్ట్ర కార్యదర్శిగా తనదైన విశిష్ట శైలితో పనిచేస్తూ తన రాజకీయ జీవితానికి బీజం వేసుకున్నారు. జై ఆంధ్రా ఉద్యమంలో, తెన్నేటి విశ్వనాథం సారథ్యంలో చురుకైన పాత్ర నిర్వహించి రాష్ట్ర వ్యాప్తంగా వార్తల్లో వ్యక్తిగా అందరి దృష్టిని ఆకర్షించాడు. తన అనర్గళ ఉపన్యాసధాటితో వ్యంగోక్తులతో సభికుల కరతాళ ధ్వనులు అందుకుంటూ గంటల తరబడి ప్రసంగించేవారు. జై ఆంధ్రా ఉద్యమం తరువాత ఇందిరా గాంధీ 1975లో ఎమర్జెన్సీ విధించినప్పుడు మీసా క్రింద అరెస్టు అయ్యి 17 నెలలు జైలు జీవితం గడిపారు. దివంగత లోక్‌నాయక్ జయప్రకాష్ నారాయణ్ స్థాపించిన ఛాత్ర సంఘర్షణ సమితి అధ్యక్షుడుగా వెంకయ్య నిర్వహించిన పాత్ర అప్పట్లో అందరి అభిమానాన్ని చూరగొన్నది. 1977లో ఒంగోలు పార్లమెంటుకు పోటీ చేశారు. 1979 నుండి 1980 వరకు బిజెవైఎం జాతీయ ఉపాధ్యక్షుడుగా పని చేశారు. 1978లో ఉదయగిరి శాసనసభకు పోటీ చేసి జిల్లాలో ఏకైక జనతా పార్టీ అభ్యర్థిగా గెలుపొందారు. 1978 నుండి 1983 వరకు బిజెపి శాసనసభా పక్ష నాయకుడుగా వ్యవహరించి, అసెంబ్లీలో తన మేధస్సుతోను, వాగ్ధాటితోను ఎందరో అనుభవజ్ఞుల చేత కూడా 'శభాష్' అనిపించుకొంటూ అసెంబ్లీ టైగర్ అనే ప్రజాబిరుదును కైవసం చేసుకున్నారు. 1980లో బిజెపి ఆవిర్భావంతో భారతీయ జనతా యువమోర్చా అధ్యక్షులుగా వ్యవహరించారు. 1983వ సంవత్సరంలో జరిగిన ఎన్నికలలో కూడా ఎలాంటి పొత్తు లేకుండా ఎన్‌టిఆర్ ప్రభంజనంలో సైతం ఉదయగిరి నుంచి ఆయన భారీ ఆధిక్యంతో గెలుపొందారు.

ఆచార్య ఆదిత్య

ఉదయగిరి నియోజక వర్గం నుంచి రెండు సార్లు శాసనసభ్యునిగా ఎన్నికైన ఘనత వెంకయ్య నాయుడికే దక్కింది. 1985లో తెలుగుదేశంలో జరిగిన సీట్ల సర్దుబాటులో ఆయన ఆత్మకూరు నియోజక వర్గం నుంచి అసెంబ్లీకి పోటీ చేసి స్వల్పతేడాతో ఓటమి పాలయ్యారు. 1989 బాపట్ల నుంచి 1991లో హైదరాబాదు నుంచి పార్లమెంటుకు పోటీ చేసి ఓటమిని చవిచూశారు. ఎన్నికల్లో ఓటమి ఆయన రాజకీయ జీవితంపై వీసమెత్తు ప్రభావం కూడా చూపలేదు. రాజకీయ ఉద్దండుడైన జైపాల్‌రెడ్డి, గౌతులచ్చన్న, సహెచ్. రాజేశ్వరరావు, నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి నాయకుల సరసన వెంకయ్య నాయుడు తనదైన శైలిలో ప్రజాసమస్యల వాణిని వినిపిస్తూ సునిశిత విమర్శలతో ప్రభుత్వ పని తీరుపై స్పందించి కాంగ్రెస్‌ను ఇరకాటంలో పెట్టేవారు. 1985 నుండి 1988 దాకా రాష్ట్ర బిజెపి ప్రధాన కార్య దర్శిగా 1989 నుండి 93 దాకా రాష్ట్ర అధ్యక్షుడుగా పనిచేశారు. తరువాత 1993లో రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా ఎంపికయ్యారు. 1998లో కర్నాటక నుంచి రాజ్యసభ సభ్యునిగా ఎంపికయ్యారు. బిజెపి పార్లమెంటు బోర్డు కార్యదర్శిగాను, బిజెపి సెంట్రల్ ఎలక్షన్ కమిటీ కార్యదర్శిగాను బిజెపి అధికార ప్రతినిధిగానూ వెంకయ్యనాయుడు ఇప్పటి వరకు సమర్థవంతంగా బాధ్యతలు నిర్వహించారు. సమర్థవంతంగా జాతీయ స్థాయి నాయకత్వానికి ఎదిగాడు.

కొరవ 12వ పేజీలో



నెల్లూరు సౌత్ రైల్వేస్టేషన్‌లో ప్లాట్‌ఫారం ఎత్తు తక్కువగా వుండడం వల్ల అవస్థలుపడుతూ ప్రయాణీకులు రైలు ఎక్కుతున్న దృశ్యం. ప్రక్కన చెట్ల పాలున్నాయి.

# ఖాకీలనీడలో 'గ్రీన్‌గ్లోరీ' బ్రదర్స్

గ్రీ. గ్లోరి చైన్ లింక్ స్కీమ్ పేరుతో లక్షలాది రూపాయలు ప్రజల నెత్తిన టోపీ పెట్టిన దాని నిర్వాహకులు రవిచంద్ర, యువరాజ్‌లను అరెస్ట్ చేయడంతో పోలీసులు మీనమేషాలు లెక్కపెడుతున్నారు. వీరిని అరెస్ట్ చేస్తే కొందరు పోలీసులు అధికారుల గుట్టురట్టవుతుంది. అందువల్లనే వారిద్దరినీ ఒక

## కొత్త ఎస్పీగారైనా లాఠీ ఝళిపించాలి

పోలీసు అధికారి రహస్య ప్రదేశంలో ఉంచాడని చెబుతున్నారు. తిరుపతికి చెందిన రవిచంద్ర, యువరాజ్ సోదరులు కొంతకాలం క్రితం నెల్లూరు వచ్చి ఈ స్కీమ్‌లో మొదట స్టోన్‌హౌస్‌పేటకు చెందిన వ్యాపారస్తులను భాగస్తులుగా చేసి ప్రారంభించారు. గతంలో జిల్లా ఎస్పీగా పనిచేసిన నరసయ్యను లక్షలు వస్తాయని నమ్మబలకడంతో ఆయన గ్రీన్‌గ్లోరి బ్రదర్స్‌కు మద్దతు ప్రకటించారు. ఈ బ్రదర్స్ గతంలో ఎఎస్పీగా పనిచేసిన కుమార్‌ను, ఎక్సైజ్ ఎస్పీ గంగాధరంను కూడా తమ బుట్టలో వేసుకొన్నారు. దీంతో క్రింది స్థాయి పోలీసులంతా దొరల హుకుంతో 11వేలు కట్టి ఈ స్కీమ్‌లో సభ్యులయ్యారు. కావలి డిఎస్పీ రెడ్డయ్య, నెల్లూరు టౌన్ సిఐ రమణారావు, కావలి సిఐ సాయిబాబాతోపాటు, ఆత్మకూరు, ఉదయగిరి సిఐలు ఈ స్కీమ్‌ను పెంచిపోషించారు. ఎస్పీ నరసయ్య, ఎస్పీ దగ్గర సిసి బాబు, కావలి డిఎస్పీ రెడ్డయ్యకు మాత్రమే గ్రీన్ గ్లోరి బ్రదర్స్ భారీ మొత్తంలో ముట్టజెప్పారు. అయితే ఎస్పీ నరసయ్య బదలీ అయిన రెండవ రోజే గ్రీన్‌గ్లోరి బ్రదర్స్ నెల్లూరు నుంచి రాత్రికి రాత్రే మకాం మార్చేశారు. గ్రీన్‌గ్లోరి బ్రదర్స్‌పై ఐదవ పట్టణ పోలీసు స్టేషన్‌లో ఎ.ఆర్. కానిస్టేబుల్ ఒకరు చీటింగ్ కేసు పెట్టారు. మొదట ఈ కేసును విచారించమ ఐదవ పట్టణ ఎస్ఐ

తరువాయి 16వ పేజీలో



నార్తు మోపూరు హైస్కూల్‌లో అదనపు గదులను ప్రారంభిస్తున్న ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి. ప్రక్కన దీద రవిచంద్ర, హరిప్రసాద్‌రెడ్డి, రంగారెడ్డి తదితరులున్నారు.

# మంచిగా వుండండి, మంచిపేరు తేండి

పోలీసులు ప్రజలతో సత్సంబంధాలు కలిగి శాంతిభద్రతలను పరిరక్షించడంలో, ప్రజల్లో ధైర్యాన్ని పెంపొందించడంలో చిత్తశుద్ధిగా వ్యవహరించాలని జిల్లా ఎస్పీ కె.శ్రీనివాసులురెడ్డి ఉద్బోధించారు. పోలీసు సంరక్షణ దినోత్సవాన్ని పురస్కరించుకొని 21తేది పెరేడ్ గ్రౌండ్‌లో ఏర్పాటైన కార్యక్రమంలో ఎస్పీ మాట్లాడారు. కొందరు పోలీసులు చేస్తున్న చెడ్డ పనుల వల్ల పోలీసు శాఖకు అపఖ్యాతి వస్తుంది. మిగతా పోలీసులు సమర్థతతో పనిచేసి దీన్ని రూపుమాపాలన్నారు. రాష్ట్రంలో విధి నిర్వహణలో ఈ యేడాది 188 మంది పోలీసులు

## పోలీసులకు ఎస్పీ హితవు

ప్రాణాలు కోల్పోయిన విషయాన్ని ఎస్పీ ఈ సందర్భంగా గుర్తు చేశారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న కలెక్టర్ ప్రవీణ్ కుమార్ మాట్లాడుతూ జిల్లాలో విధి నిర్వహణలో ప్రాణాలు కోల్పోయిన పోలీసు కుటుంబాలకు ఇళ్లపట్టాలు, డిఆర్‌డిఎ ద్వారా ఉపాధి, ఆర్థిక సహాయం తదితరాలు కల్పిస్తామన్నారు. హైస్కూల్, కాలేజి విద్యార్థులకు పోలీసు అధికారులు నిర్వహించిన వ్యాసరచన, వక్తృత్వపోటీల్లో విజేతలకు కలెక్టర్, జిల్లా జడ్జి అంజనేయులు మెమెంటోలు అందజేశారు. అనంతరం జిల్లా జడ్జి పోలీసుల రక్తదాన శిబిరాన్ని ప్రారంభించారు. ఈ సందర్భంగా పోలీసులు టౌన్‌లో ప్రదర్శన చేశారు. గాంధీ బొమ్మ వద్ద ప్రదర్శనను ఉద్దేశించి ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మాట్లాడారు. డిఆర్‌ఓ వెంకటేశ్వర్లు, మునిసిపల్ కమీషనర్ వేమారెడ్డి ఈ ప్రదర్శనలో పాల్గొన్నారు.

# కసురుకొనే ముసురు పట్టారు

కొమ్మి లక్ష్మయ్యనాయుడు ఎమ్మెల్యేగా గెల్చిన తర్వాత తన కాంట్రాక్టులు తాను చూసుకొంటూ కార్యకర్తలను పట్టించుకోక పోవడం వల్లే ఓటమిని చవిచూడాల్సి వచ్చిందని పలువురు కార్యకర్తలు అభిప్రాయపడ్డారు. 23తేది సోమశిల గెస్ట్‌హౌస్‌లో జరిగిన పార్టీ నియోజకవర్గ కార్యకర్తల సమావేశంలో పరిశీలకుడు కొమ్మినేని ప్రసాదరావు ముందు లక్ష్మయ్యనాయుడు ధోరణిని తూర్పారపట్టారు. సహనంలేని మనిషి, ఎవరిమీదనైన ఒంటికాలి మీద వెళ్లి పార్టీ ప్రతిష్టనుమంట గలిపాడు. ఇప్పుడైన ఏ పని మీదనైన జిల్లా పార్టీ నాయకులు, అధికార్ల వద్దకు వెళ్లి ఆత్మకూరు నుంచి వచ్చామంటే చీదరించుకొంటారని కలువాయి మండల పార్టీ నాయకుడు అభిప్రాయపడ్డారు. పరిశీలకుడు ప్రసాదరావు మాట్లాడుతూ పార్టీలో కష్టపడి పనిచేసిన కార్యకర్తలకు గుర్తింపు తప్పనిసరిగా వస్తుందని, రేపు పంచబోయే నామినేటెడ్ పదవులన్నీ నిజమైన కార్యకర్తల కోసం ఎత్తి పెట్టిన వేనన్నారు. నవంబరు 8తేది నుంచి 24తేది వరకు జరిగే పార్టీ సభ్యత్వ నమోదు కార్యక్రమంలో కార్యకర్తలు ఉత్సాహంగా పాల్గొనాలని పిలుపు నిచ్చారు. కార్యకర్తలు ఎదురు తిరిగి మాట్లాడేసరికి కొమ్మి లక్ష్మయ్యనాయుడు దంగ్రైపోయారు. పెద్దగా సమావేశంలో మాట్లాడలేక పోయారు. రీకో ఛైర్మన్ పందిళ్లపల్లి సుబ్బారెడ్డి, కంచర్ల శ్రీనివాసులు

## కొమ్మిపై కార్యకర్తల విసురు

నాయుడు తదితరులు సమావేశంలో పాల్గొన్నారు.

## అక్షర సంక్రాంతిలో ముందు నిలవాలి

జిల్లాలో రానున్న సంక్రాంతికి 2లక్షలా 50వేల మందిని అక్షరాస్యులుగా చేయాలని లక్ష్యంగా పెట్టుకొని అక్షర సంక్రాంతి కార్యక్రమాన్ని చేపట్టినట్లు ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి చెప్పారు. 23తేది అల్లూరు మండలం నార్తుమోపూరులో ఏర్పాటైన అక్షర సంక్రాంతి వాలంటీర్ల శిక్షణా శిబిరాన్ని మంత్రి ప్రారంభించి మాట్లాడారు. జిల్లా పలు ఉద్యమాలకు పుట్టిల్లు; పలు పథకాల అమలులో రాష్ట్రంలో అగ్రస్థానంలో నిలిచింది. అక్షర సంక్రాంతి కార్యక్రమంలో కూడా జిల్లాను ముందంజలో నిలిపేందుకు కార్యకర్తలు కృషి చేయాలన్నారు. జిల్లాలో వున్న 14వేల స్వయం సహాయక గ్రూపులలో వున్న నిరక్షరాస్యులందరినీ అక్షరాస్యులు చేసేందుకు ప్రతి గ్రూపు లీడరు కృషి చేయాలన్నారు. అల్లూరు మండలంలో నిరక్షరాస్యులుగా వున్న 10 వేల మందిని ఈ కార్యక్రమంలో అక్షరాస్యులుగా చేయాలన్నారు. తొలుత మంత్రి నార్తుమోపూరులోని ప్రాథమికోన్నత పాఠశాలలో 10వ తరగతిని ప్రారంభించారు. 7వ తరగతి చదువుతున్న విద్యార్థినీ విద్యార్థులను తెలుగు, సైన్సు సబ్జెక్టులలో ప్రశ్నలు వేసి విద్యార్థుల ప్రతిభను తెలుసుకొన్నారు.

* * *

# అల్లూరుకు 20 కోట్ల పనులు

అల్లూరు నియోజకవర్గంలో తన ఏడాది పాలనలో 20కోట్ల 50లక్షల రూపాయలతో అభివృద్ధి పనులు చేపట్టినట్లు ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి చెప్పారు. 20తేది అల్లూరులో 8లక్షల రూపాయల వ్యయంతో నిర్మించిన లింకు రోడ్డు నిర్మాణం, మంచినీటి విస్తరణ పథకాన్ని మంత్రి ప్రారంభించి అనంతరం ఏర్పాటైన సభలో మాట్లాడారు. పంచాయతీరాజ్ విభాగంలో 265లక్షల రూపాయలతో 121 పనులు, 148 లక్షల రూపాయలతో 71 స్కూల్ భవనాల నిర్మాణ పనులు చేపట్టాం. 184 లక్షల రూపాయలతో 107 సాగునీటి వనరుల పనులు, 109లక్షల రూపాయలతో రెండు ఇరిగేషన్ పనులు, 64 లక్షల రూపాయలతో రెండు ఇరిగేషన్ బ్రిడ్జి పనులు చేపట్టినట్లు మంత్రి పేర్కొన్నారు. ఇవిగాక 5కోట్ల 55లక్షల రూపాయలతో 3125 పక్కా ఇళ్ల నిర్మాణం చేపట్టినట్లు చెప్పారు. అల్లూరు చెరువు నుండి సముద్ర తీరప్రాం

## జిల్లావార్తలు

తాలలోని ప్రజల దాహార్తిని తీర్చేందుకు 10కోట్ల రూపాయలతో సమగ్ర మంచినీటి పథకం మంజూరయ్యిందని, మొదటి విడతగా ఈ పథకానికి ముఖ్యమంత్రి 5కోట్ల రూపాయలు విడుదల చేశారని మంత్రి వెల్లడించారు. అల్లూరు

తరువాయి 13వ పేజీలో



# హృదయపూర్వక శుభాకాంక్షలు

1999 E.C. Act Amendment Bill విషయమై వ్యాపారస్థుల కోసం ప్రధానమంత్రి వాజ్‌పేయితో చర్చించి గత పార్లమెంట్ సమావేశాల్లో ప్రవేశపెట్టకుండా కృషిచేసి యావత్తు ఆంధ్రప్రదేశ్ వ్యాపారస్థుల మనస్సులలో చిరస్థాయిగా స్థానం నిలుపుకున్న వ్యాపారస్థుల ఆపద్బాంధవుడు

## శ్రీ వెంకయ్య నాయుడు గారు

ప్రప్రథమంగా మన నెల్లూరు జిల్లాకు విచ్చేస్తున్న శుభ సందర్భంలో జిల్లా వ్యాపారస్థుల ఛాంబర్ ఆఫ్ కామర్స్ వారి శుభాకాంక్షలు.

**స్వాగతం! సుస్వాగతం!!**

**నెల్లూరు జిల్లా ఛాంబర్ ఆఫ్ కామర్స్**

గౌరవాధ్యక్షుడు : సన్నపురెడ్డి పెంచలరెడ్డి — అధ్యక్షుడు : కనుమర్లపూడి తిరుమలరావు

జనరల్ సెక్రటరీ : దాసా లక్ష్మీనారాయణ — కోశాధికారి: కనుమర్లపూడి గురునాథం

ఉపాధ్యక్షుడు : వాయుగుండ్ల వెంకటేశ్వర్లు — జాయింట్ సెక్రటరీ : చలువాది నాగేశ్వరరావు

ఉపాధ్యక్షుడు : అమరా దశరథరామయ్య

**సింహపురి వాణిజ్య మండలి**

కార్యదర్శి : పెసల నరసింహస్వామి — ఉపాధ్యక్షుడు : బచ్చు బ్రహ్మయ్య

ఉపాధ్యక్షుడు : కొండా వెంకటరామయ్య — కోశాధికారి : చల్లగుండ్ల మోహనరావు

పైడిమర్రి కామేశ్వరరావు, అధ్యక్షుడు, నెల్లూరు జిల్లా టామరెండ్ మర్చంట్స్ అసోసియేషన్

మంచికంటి శ్రీనివాసులు, అధ్యక్షుడు, శ్రీ వాసవి కిరాణా మర్చంట్స్ అసోసియేషన్

# స్వాగత శుభవేళ - ఆనంద హేల



ప్రజాసేవారంగంలో మెరుపు తునక
భారతీయ జనతలో నిప్పు కణిక
నీతి నిజాయితీలకు కరదీపిక
సమత మమతల మేలు కలయిక

మనవాడు - **వెంకయ్య నాయుడు**

కేంద్ర మంత్రిగా జన్మనిచ్చిన జిల్లాలో
కాలిడుతున్న శుభవేళ,
మనందరికీ ఆనందహేల

ఆయనకిదే **మా హార్దిక స్వాగత సుమాంజలి**

## నెల్లూరు జిల్లా రొయ్య రైతుల సంక్షేమ సంఘం

నెల్లూరు, ఫోన్ : 328258

## కేంద్ర మంత్రుల రాక

కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ మంత్రి వెంకయ్యనాయుడు, సమాచార శాఖామంత్రిణి సుష్మాస్వరాజ్, పర్యాటక శాఖ మంత్రి అనంత్‌కుమార్ 31తేది నెల్లూరు వస్తున్నారు. మద్రాసు నుంచి హెలికాప్టర్‌లో ఉదయగిరి వెళ్లి అక్కడ ఏర్పాటు చేసిన కార్యక్రమాల్లో పాల్గొంటారు. అనంతరం వెంకయ్య నాయుడు స్వగ్రామం చవటపాళెం వచ్చి అక్కడ పలు పథకాలకు శంకుస్థాపన చేస్తారు. సుష్మాస్వరాజ్, అనంతకుమార్ 31తేది తిరిగి వెళ్లినా, వెంకయ్యనాయుడు 1తేది నెల్లూరులో పలు కార్యక్రమాల్లో పాల్గొంటారు. మంత్రులు పాల్గొనే కార్యక్రమాలు అధికారికంగా ఖరారు కాలేదు.

## ధర్మారెడ్డిపై విచారణ

నెల్లూరు ఆర్టీసి రీజియన్ మేనేజర్‌గా గతంలో పనిచేసి అవినీతి ఆరోపణలపై సస్పెండ్ అయిన ధర్మారెడ్డిపై 24తేది నుంచి విచారణ జరుగుతుంది. హైదరాబాద్ నుంచి వచ్చిన ఆర్టీసి ఉన్నతాధికారి ధర్మారెడ్డిపై వచ్చిన ఫిర్యాదులపై విచారిస్తున్నారు. పొట్టి శ్రీరాములు బస్టాండ్ క్యాంటీన్, అక్కడి కాంప్లెక్స్ కేటాయింపుల విషయంలో జరిగిన అవినీతిపై ఈ అధికారి విచారించారు. ధర్మారెడ్డిపై ఎక్కువ శాతం మంది వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పినట్లు తెలిసింది.

## మసీదు భూములపై ట్రిబ్యునల్ ఇంజక్షన్

నెల్లూరులోని జామియా మసీదుకు చెందిన భూములపై ఎటువంటి లావాదేవీలు చేయడానికి వీల్లేదని రాష్ట్ర వక్ఫ్ బోర్డుకు చెందిన ట్రిబ్యునల్ తాత్కాలిక ఇంజక్షన్ ఉత్తర్వులు జారీ చేసింది. తరుపరి విచారణ వచ్చే నెల 11తేది జరుగుతుంది. ఈ భూములకు సంబంధించి ప్రతివాదుల తరఫున ఏజంట్లుగాని, ఇతరులుగాని, అమ్మకం, లీజుకు ఇవ్వడం గాని చేయరాదని ట్రిబ్యునల్ ఆదేశించింది. ఈ భూములను అమ్ముకొంటున్న మొహియుద్దీన్ బంధువు మొయినుద్దీన్ ప్రజా ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని ట్రిబ్యునల్‌లో ఈ కేసు వేశారు.

ఈ మసీదు భూముల దురాక్రమణ తర్వాత జిల్లా యంత్రాంగం ఆలస్యంగా స్పందించింది. ఈ భూములను స్వయంగా చూసిన కలెక్టర్, విచారణాధికారిగా జాయింట్ కలెక్టర్ రావత్‌ను నియమించారు. కానీఆయన ఇంత వరకు విచారణ ప్రారంభించలేదు. గత శుక్రవారం ఇక్కడ ఒక మసీదును క్రొత్తగా నిర్మించి అందులో ప్రార్థనలు కూడా ప్రారంభించి మతం రంగు పులిమే ప్రయత్నాలు ఆరంభమయ్యాయి. ఇకనైనా జిల్లా యంత్రాంగం స్పందించి తగిన చర్యలు తీసుకొంటే పరువు నిలబడుతుంది.

## తెలుగుదేశం పార్టీలో విభేదాలు

జిల్లా తెలుగుదేశం పార్టీలో విభేదాలున్న సంగతి వాస్తవమేనని ఆ పార్టీ జిల్లా కన్వీనర్ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి అంగీకరించారు. అయితే వీటిని నివారించడానికి తన వంతు ప్రయత్నాలు తాను మొదలెట్టినట్లు చెప్పారు. విభేదాల్లో నెల్లూరు నియోజకవర్గం మొదటి స్థానంలో వుండగా, గూడూరు, వెంకటగిరి, కావలి తరువాత స్థానాల్లో ఉన్నట్లు ఎల్లసిరి అంచనా వేశారు. విభేదాలు తార స్థాయికి చేరకుండా ఎప్పటికప్పుడు సిఎంకు నివేదికలు పంపి తగిన నిర్ణయాలు తీసుకొంటున్నారట కన్వీనర్ గారు.

## జిల్లాలో పిసిసి సభ్యులు 25 మంది

జిల్లా నుంచి పిసిసి సభ్యులుగా 25 మంది ఎన్నికయ్యారు. ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, రామనారాయణ రెడ్డి, బొల్లినేని కృష్ణయ్య, సిఎల్పీ కోటాలో పిసిసి సభ్యులయ్యారు. నియోజక వర్గాల వారీగా పిసిసి సభ్యులుగా నియమితులైన వారి జాబితా ఇలా వుంది. నెల్లూరు నుంచి నందిమండలం భానుశ్రీ, ఊటుకూరు పద్మావతి, రాపూరు నుంచి చెన్ను బాలకృష్ణారెడ్డి, కాకాణి గోవర్ధన్‌రెడ్డి, ఆత్మకూరు నుంచి డాక్టర్ సుందర రామిరెడ్డి, పూసల రంగయ్య, సర్వేపల్లి నుంచి సి.వి.శేషారెడ్డి, బత్తుల శ్యామలమ్మ, కోవూరు నుంచి దేవకుమార్‌రెడ్డి, పనబాక లక్ష్మి, ఉదయగిరి నుంచి మేకపాటి రాజమోహన్ రెడ్డి, షబ్బీర్, గూడూరు నుంచి నేదురుమల్లి పద్మనాభ రెడ్డి, రమణమ్మ, వెంకటగిరి నుంచి నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ, సిహెచ్. రమణారెడ్డి, అల్లూరు నుంచి విష్ణువర్ధన్ రెడ్డి, కె.గోపాలరెడ్డి, కావలి నుంచి కె.యానాదిరెడ్డి, జంపని రాఘవులు, సూళ్లూరుపేట నుంచి పసల పెంచలయ్య, రాజసులోచనమ్మ ఎన్నికయ్యారు. సిఎల్పీ కోటా నుంచి జిల్లాకు చెందిన ముగ్గురు ఎమ్మెల్యేలకు పిసిసి స్థానం కల్పించడం వైశేషం.

## పాత విద్యార్థులకు ప్రత్యేక పిలుపు

కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ మంత్రి వెంకయ్య నాయుడు గారు నెల్లూరుకు మొదటి సారిగా వస్తున్న సందర్భంగా విఆర్ కాలేజీలో సన్మానించబోతున్నారు. కాలేజి పాత విద్యార్థులు కొంత మంది పూనుకుని చేస్తున్న చిరు సభ ఇది. అతిథులు కూడా పాత విద్యార్థులే. మాజీ ముఖ్యమంత్రి ఎన్.జనార్ధనరెడ్డి, రాష్ట్రంలోనే ప్రముఖ పారిశ్రామికుడుగా ఎదిగిన జి.వి.కె, ఢిల్లీలోని గ్యాస్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్ ఛైర్మన్‌గా వున్న నెల్లూరీయుడు సి.ఆర్. ప్రసాద్, వెంకయ్య నాయుడు రాజకీయ ప్రారంభ దశలో ప్రోత్సాహం కల్పించిన ఆనం భక్తవత్సలరెడ్డి ఇందులో పాల్గొంటారు. రాజకీయాలకు అతీతంగా, విఆర్ కాలేజీలో చదివిన ప్రతి పాత విద్యార్థి ఈ సభకు ఆహ్వానితుడే. ఇందులో పార్టీల ప్రస్తావన లేదు. అందరికీ ఇదే మా ఆహ్వానం.

— వి.ఆర్. కాలేజీ పాత విద్యార్థుల బృందం

## ఎమ్మెల్యే, మంత్రికి మధ్య మనస్పర్థలు

ఒకే నియోజక వర్గానికి చెందిన ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి ఎమ్మెల్యే డాక్టర్ రాజేశ్వరమ్మ మధ్య మనస్పర్థలు చోటు చేసుకున్నట్లు తెలిసింది. ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి అధ్యక్షతన జరిగిన పార్టీ తొలి అడ్‌హాక్ కమిటీ సభ్యుల సమావేశంలో మంత్రి అనుచరులు తనను నిష్టూరంగా మాట్లాడడం పట్ల ఎమ్మెల్యే నొచ్చుకొన్నట్లు తెలిసింది. దీనికి బదులుగా మంత్రి బుచ్చిలో పంచాయతీ కాంప్లెక్స్ ప్రారంభోత్సవానికి తనను పిలవని విషయంలో ఎమ్మెల్యే హస్తమున్నట్లు చెప్పేసరికి, రాజేశ్వరమ్మ చిటపటలాడారట. తనను అవమానిస్తే వెంటనే రాజీనామా చేశానని, ముఖ్యమంత్రికి ప్రభాకరరెడ్డిపై ఫిర్యాదు చేస్తానని కూడా చెప్పారట.

ఎమ్మెల్యేగారి దబాయింపు భలేవుంది. ఎన్నికల్లో ఆదాల ప్రభాకరరెడ్డి నుంచి ఆర్థిక సహాయం తీసుకొని ఆ తర్వాత సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి పంచన చేరారామె. చంద్రమోహన్‌రెడ్డి చెప్పిన వారికే టెలిఫోన్ సలహా సభ్యుల కమిటీలో సభ్యత్వాలు కట్టబెట్టారు.

## ప్రభుత్వ హాస్టళ్లలో దీపావళి

జిల్లాలోని ప్రభుత్వ హాస్టళ్లలో వుండే విద్యార్థినీ, విద్యార్థులు కూడా దీపావళి పండుగను ఆనందోత్సాహాలతో చేసుకొనే ఏర్పాటు చేశారు జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్. దాతలు కెవి.రత్నారా నారాయణ, జె.కె.రెడ్డి, గిరి, బి.వి.కె.రెడ్డి, టి. శివప్రసాద్ రెడ్డిల సహకారంతో టపాసులు, స్వీట్స్, పండ్లు కొనుగోలు చేయించారు. వీటిని హాస్టళ్లలోని పిల్లలకు పంపిణీ చేశారు. మద్రాసు బస్టాండ్ వద్ద వున్న వెనుకబడిన తరగతుల బాలికల వసతి గృహం ఆవరణంలో విద్యార్థినీ, విద్యార్థులకు పండ్లు, స్వీట్స్, టపాసులను జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ 26తేది స్వయంగా పంచారు. ఈ కార్యక్రమంలో ఎస్పీ కె.శ్రీనివాసులురెడ్డి, పౌరసరఫరాల జోనల్ మేనేజర్ శ్రీమతి సునీత పాల్గొన్నారు. ఓ మంచి కార్యక్రమానికి శ్రీకారం చుట్టిన కలెక్టర్ అభినందనీయుడు.

## డ్రగ్ ఇన్స్‌పెక్టర్ వివరణ

తన మీద జమీన్‌రైతులో గతవారం వచ్చిన వార్తకు డ్రగ్ఇన్స్‌పెక్టర్ కుమార్ వివరణ పంపారు. తాను ఈ యేడాది 337 మందుల షాపులు, 36 నర్సింగ్ హోమ్‌ల తనిఖీకి వెళ్లానని అక్కడ 61శాంపిల్స్ తీసినట్లు వివరించారు. సబ్బు నీళ్లు పోసి యాంటిరాబీస్ ఇంజక్షన్లుగా అమ్ముతున్న ముఠాతోపాటు.

తారువ 12వ పేజీలో



# శుభాకాంక్షలు

నెల్లూరు జిల్లాలో సామాన్య రైతు కుటుంబంలో పుట్టి
అంచెలంచెలుగా ఎదిగి
కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖామాత్యులుగా

## శ్రీ వెంకయ్య నాయుడు గారు

ప్రమాణ స్వీకారం చేసి ప్రప్రథమంగా నెల్లూరు జిల్లాకు
విచ్చేస్తున్న శుభ సందర్భములో వారికి
నెల్లూరు జిల్లా పాల ఉత్పత్తిదారుల తరపున హార్దిక శుభాకాంక్షలు.



**ముప్పవరపు గోపాలకృష్ణ చౌదరి**
**ఛేర్మన్**

విజయ

**నెల్లూరు జిల్లా పాల ఉత్పత్తిదారుల సహకార సమితి**
నెల్లూరు, ఫోన్ : 331384, 328526

# నెల్లూరు పురపాలక సంఘము

## మెదడువాపు వ్యాధి నివారణ చర్యలు

రాష్ట్రంలో అనేక పట్టణములలో మెదడు వాపు వ్యాధి సాధారణముగా ఆగస్టు నెల నుంచి డిసెంబర్ నెల లోపల వస్తుంది.

### I. ఈ వ్యాధి వ్యాపించే విధానం

1) ఈ వ్యాధి జపనీస్ ఎన్‌సఫలిటిస్ అనబడే వైరస్ ద్వారా సంక్రమిస్తుంది.
2) ఈ వ్యాధి పందులు, పశువులు యితర జంతువుల వలన వృద్ధి చెందుతుంది.
3) మెదడు వాపు వ్యాధిని కలిగియున్న పందులు మరియు జంతువులను దోమలు కుట్టి ఆ రక్తం ద్వారా వ్యాధికారక వైరస్‌ను పీల్చుకుని తదనంతరం మనుషులను కుట్టడం ద్వారా ఈ వ్యాధి మనుషులకు సోకుతుంది.
4) ఇది పిల్లలలో **2-12** సంవత్సరముల మధ్య వయసు గల వారికి ఎక్కువగా సంక్రమిస్తుంది. పురుషులు ఎక్కువగా గురి అవుతారు.
5) మనిషి నుండి మనిషికి ఈ వ్యాధి నేరుగా వ్యాపించదు.
6) ఈ వ్యాధికి గురి అయిన పిల్లలు శాశ్వతంగా నాడీ మండలమునకు సంబంధించిన దుష్పరిణామాలకు గురవుతారు.
7) ఈ వ్యాధి వర్షాకాలం తరువాత ఎక్కువగా ప్రబలుతుంది.

### II. వ్యాధి లక్షణాలు

అకస్మాత్తుగా వణుకు, తలనొప్పి, వంటి నొప్పులు, జ్వరము మరియు వాంతులతో ఈ వ్యాధి ప్రారంభమగును. కొన్ని సందర్భములలో స్పృహ కోల్పోవడం మరియు పక్షవాతం కూడా సంభవించవచ్చును. మరణము కూడా సంభవించవచ్చును.

### III. వ్యాధి నిరోధానికి తీసుకోవలసిన చర్యలు

1) పందులను ఇండ్లకు 5కి.మీ కంటే ఎక్కువ దూరంలో వుంచాలి.
2) ఇండ్లలో దోమ తెరలువాడాలి. దోమల మందులు చల్లాలి
3) వేప ఆకు పొగ ద్వారా దోమలను పారద్రోలాలి
4) నీటి గుంటలలో దోమలు వృద్ధి కాకుండా చూడాలి.
5) మస్కిటోమాట్స్, రిపిల్లెంట్లు, క్రీములు ఉపయోగించాలి.
6) వ్యాధి లక్షణాలు కనబడగానే రోగిని సమీప ఆరోగ్య కేంద్రమునకు సత్వరమే తీసుకొని పోవలెను.
7) చిన్న పిల్లలకు వ్యాక్సినేషను (టీకాలు) వేయించాలి.
8) బెల్లడోనా మాత్రలను తగు మోతాదులో ఇప్పించవలెను.

**కె. వేమారెడ్డి, కమీషనర్, నెల్లూరు మునిసిపాలిటీ**

# జిల్లా కాంగ్రెస్ అధ్యక్ష పదవి బ్రహ్మ రహస్యంగా కన్పిస్తుంది!

నెల్లూరు జిల్లా కాంగ్రెస్ అధ్యక్ష పదవి బ్రహ్మ రహస్యంగా కన్పిస్తున్నది. ఎన్నిక తేది గడిచి పోయినా ఎన్నిక మాత్రం జరగలేదు. అభ్యర్థి ఎవరన్న చర్చ చేసి చేసి కాంగ్రెస్ కార్యకర్తలు అలసి పోతున్నారు; నేతలు విసిగి పోతున్నారు. ఎక్కడ ఏమి జరుగుతున్నదో, ఎందుకు ఆలస్యం జరుగుతున్నదో ఎవరికి అంతుబట్టడం లేదు.

డిసిసి అధ్యక్షత పెద్ద పదవి కాదు. దాని వల్ల అది పొందిన వారికి గాని, పార్టీకి గాని ఒరిగే మేలు ఏదీ లేదు. ప్రతిపక్షంలో పార్టీ పదవుల వల్ల ప్రయోజనం ఏమి వుంటుంది చెప్పండి. ఇదివరకైతే జిల్లాలో కాంగ్రెస్‌కు ఎమ్మెల్యేలు లేరు. ఉండిన ఒక్క యానాదిరెడ్డి గారు పార్టీ పనుల జోలికి వచ్చే వారు కాదు. కాని ఇప్పుడు ఒకరికి నలుగురు ఎమ్మెల్యేలు వున్నారు. నలుగురు కూడా స్వంత వ్యక్తిత్వం కల్గిన వారు. రాజకీయంగా బలవంతులు. వారి ప్రభావం ముందు పార్టీ అధ్యక్షుడు పాచికలు ఏవీ పారవు. ఎమ్మెల్యేల నీడ క్రింద, నామకార్థం, నామ్‌కేవాస్తే అన్నట్లు వుండవల్సిందే తప్ప స్వంతంగా, స్వతంత్రంగా వ్యవహరించేందుకు వీలు లేదు. ఈ కోణం నుంచి చూసినప్పుడు డిసిసి పెత్తనం ఎవరిది అన్న చర్చతో బుర్ర వేడెక్కించుకోవల్సిన అవసరం ఏమి వుంది?

కాని రాజకీయాలలో వుండేవారికి ఎప్పుడు ఏదో ఒక కాలక్షేపం కావాలి. అందుకు ఇది బాగా వుపయోగపడుతున్నది.

ఎన్నిక ఎక్కడ చిక్కు ముడి పడింది అన్నది ప్రశ్న. ఒక్క నెల్లూరు జిల్లాయే కాదు. రాష్ట్రంలోని చాలా జిల్లాలలో ఈ నియామకాలు నిలిచిపోయి వున్నాయి. ఎన్నిక వాయిదా వేయమని ఏఐసిసి ఆదేశం ఇచ్చిందన్న వార్తలు సరి కాదని ఆ తర్వాత తేలినా, రాష్ట్ర నేతలెవరూ ఈ విషయంలో చొరవ చూపడం లేదు. అందరి దృష్టి ఇప్పుడు ఏఐసిసి అధ్యక్షత మీద, సిడబ్ల్యుసి సభ్యత్వాల మీద వుంది. సోనియా గాంధీ

## జనార్ధనరెడ్డిదే తుదినిర్ణయం

రేపు 28తేది కాంగ్రెస్ ప్రెసిడెంట్ ఎన్నికకు నామినేషన్ దాఖలు చేయబోతున్నారు. ఆమెకు జితేంద్ర ప్రసాద నుంచి సవాలు వస్తుండడంతో అందరు తమ విధేయతను ప్రకటించుకోవడానికి సోనియా కనుసన్నలలోనే మెలుగుతున్నారు. ఎవరైనా ఒకటి రెండు రోజులు కన్పించకుండా పోతే, శత్రు శిబిరంలో చేరిపోయినట్లు ప్రచారం జరిగే ప్రమాదం వుంది కాబట్టి ఎవరు కూడా ఢిల్లీ వదలి వచ్చే పరిస్థితి లేదు. డిసిసి పదవులు వెనక్కు పోవడానికి అసలు కారణం ఇదే.

నెల్లూరులో వినపడే అభిప్రాయం మాత్రం ఇది కాదు. జిల్లా నేతల మధ్య పొత్తు కుదరక పోవడమే ఆలస్యానికి కారణం అన్నది కార్యకర్తల నమ్మకం. దిన పత్రిక వార్తలు కూడా ఈ వాదాన్ని పెంచి పోషిస్తున్నాయి. అయితే జిల్లా కాంగ్రెస్‌లో అటువంటి పరిస్థితులు ఇప్పటి వరకు లేవు. ఇక ముందు వస్తాయేమో తెలియదు. జిల్లాకు సంబంధించి ఈనాటి వరకు నేదురుమల్లి జనార్ధనరెడ్డి మాటే వేద వాక్కుగా చలామణి అవుతున్నది. ఎమ్మెల్యేలు, మాజీ ఎమ్మెల్యేలు, ఇతర నేతలందరు తమలో తమకు అభిప్రాయ భేదాలు వున్నప్పటికి జిల్లాకు సంబంధించి మాత్రం ఒకే మాట మీద నిలబడుతున్నారు. ఎవరి విషయంలోను ఇంకొకరు జోక్యం చేసుకోకుండా కట్టడి చేయడం వల్లనే అందరు కల్సి వుండగల్గుతున్నారన్నది నిజం. ఈ విషయంలో జనార్ధనరెడ్డి చాలా నేర్పుగా వ్యవహరిస్తున్నారు. డిసిసి పదవిలోను ఆయన ధోరణి వేరుగా వుండే అవకాశం లేదు.

ఇందుకు కాబోయే పెళ్లికొడుకు ఎవరు? ఇది మాత్రం చిదంబర రహస్యం. రహస్యం అనడం కంటే ఎవరు అనే నిర్ణయం ఏ దశలోను జరగలేదనడం నిజం. 28తేది తర్వాత, ఇంద్ర జాలికుడి టోపి నుంచి కుందేలు వచ్చినట్లు, జనార్ధనరెడ్డి మస్తిష్కం నుంచి వెలువడుతుంది - పేరు. అప్పటి వరకు వూహాగానాలు, వాద వివాదాలు మనకు మంచి కాలక్షేపం. *

## నెల్లూరుముచ్చట్లు

10వ పేజీ కొరవ

ట్రాన్స్‌పోర్టు వ్యాన్‌లో వెళ్తున్న లక్ష రూపాయలు విలువ చేసే ఫిజీషియన్ శాంపిల్స్ సీజ్ చేశానన్నారు. ఫిజీషియన్ శాంపిల్స్ అమ్ముతున్నవారిపై కేసును నమోదు చేసి తన డ్యూటీ తాను బ్రహ్మాండంగా చేస్తున్నట్లు వివరించారు.

***

ఈ విషయమై ది నెల్లూరు డిస్ట్రిక్ట్ కెమిస్ట్ అండ్ డ్రగ్గిస్ట్ అసోసియేషన్ కూడా ఒక వివరణ పంపింది. డ్రగ్ ఇన్స్‌పెక్టర్ మంచివాడని సర్టిఫికెట్ ఇచ్చింది. డ్రగ్ ఇన్స్‌పెక్టర్‌కు మందుల షాపు వాళ్ల సర్టిఫికెటా!

### క్యూబాకు వకీలు అనంతరామయ్య

నెల్లూరులో సీనియర్ న్యాయవాది వేములపాటి అనంతరామయ్య క్యూబా



దేశంలోని హవానాలో జరుగుతున్న రెండవ అంతర్జాతీయ సంఘీభావ సమావేశానికి వెళ్తున్నారు. ఈ సమావేశం నవంబరు 10తేది నుంచి 14తేది వరకు జరుగుతుంది. ప్రపంచ వ్యాప్తంగా వున్న ప్రజాస్వామ్యవాదులు, కమ్యూనిస్టులు ఈ సమావేశానికి హాజరవుతున్నారు. సమావేశంలో పాల్గొనమని సిపిఐ పార్టీ నుంచి అనంతరామయ్యకు ఆహ్వానమం దింది. ఈ మేరకు 78ఏళ్ల వయస్సు లోనూ ఓపిక చేసుకొని 70వేల రూపా యలు ఖర్చు పెట్టుకొని క్యూబాకు బయ లుదేరి వెళ్తున్నారాయన. ఇక్కడి కమ్యూనిస్ట్ నాయకుడు కాస్ట్రోను ప్రత్యక్షంగా చూడాలన్న కోరికతోనే క్యూబా వెళ్తున్నట్లు అనంతరామయ్య చెప్పారు.

### మెక్సికోకు డాక్టర్ సత్యనారాయణమూర్తి

నెల్లూరులో మంచి హస్తవాసిగల మధుమేహ నిపుణుడిగా పేరు గాంచిన డాక్టర్ సత్యనారాయణ మూర్తి దక్షిణ అమెరికాకు 31తేది వెళ్తున్నారు. అక్కడి కాన్‌కన్ నగరంలో నవంబరు 2తేది నుంచి 4తేది వరకుజరిగే గ్లోబల్ డయాబెటిక్ సదస్సులో పాల్గొంటారు. అక్కడి నుంచి 5తేది మెక్సికో వెళ్లి, 10తేది వరకు అక్కడ జరిగే 17వ ఇంటర్నేషనల్ డయాబెటిస్ ఫెడరేషన్ కాంగ్రెస్‌లో పాల్గొంటారు. ఈ సదస్సులో సత్యనారాయణ మూర్తి 'మధుమేహ వ్యాధిలో రక్తపోటు' అనే పరిశోధనా పత్రాన్ని సమర్పించి మాట్లాడతారు. డాక్టర్ తిరిగి 12తేది నెల్లూరు వస్తారు.

### బాలాజీనగర్‌లో పందుల బెడద

బాలాజీనగర్‌లోని అన్ని వీధుల్లో పందుల సంచారం ఎక్కువగా వుంది. ఇళ్లలోదూరి దొరికిన వస్తువును దొరికినట్లు నాశనం చేస్తున్నాయి. అక్టోబర్, నవంబర్ నెలలు మెదడు వాపు వ్యాధి ప్రబలే మాసాలు కాబట్టి ఈ పందులను మునిసిపాలిటి పట్టించాలని స్థానికులు కోరుతున్నారు.

### లయన్స్ క్లబ్ వకృత్వపోటీలు

ఐక్యరాజ్య సమితి దినోత్సవాన్ని పురస్కరించుకొని లయన్స్ క్లబ్ ఆఫ్ నెల్లూరు, సేవాప్రియ, లయన్ లేడీస్ ఆగిలరీ సంయుక్తంగా స్కూల్ పిల్లలకు వకృత్వ పోటీలు నిర్వహించాయి. పోటీలు శారద ఇంగ్లీషు మీడియం హైస్కూల్‌లో జరిగాయి. విజేతలకు నవంబర్ 14తేది బాలల దినోత్సవాన్ని పురస్కరించుకొని హోటల్ శివంలో ఏర్పాటయ్యే ప్రత్యేక కార్యక్రమంలో బహుమతులిస్తామని క్లబ్ అధ్యక్షుడు ఐ.ఉదయభాస్కర్‌రావు చెప్పారు.

### రోటరీక్లబ్ ఉచితవ్యాక్సిన్

రోటరీక్లబ్ నెల్లూరు, రోటరి క్లబ్ సౌత్ ఫత్తేఖాన్‌పేటమునిసిపల్ స్కూల్‌లోని 110 మందివిద్యార్థులకు ఉచితంగా హెపటైటిస్ -బి వ్యాక్సిన్లు వేయించారు. 20తేది ఈ కార్యక్రమం జరిగింది. రెండవ విడత నవంబర్ 20తేది, మూడవ విడత ఏప్రిల్ - 2001 వేయిస్తామని క్లబ్ అధ్యక్షుడు సనత్ కుమార్‌రెడ్డి చెప్పారు. ఈ కార్యక్రమంలో క్లబ్ కార్యదర్శి రవీంద్రనాయర్, క్లబ్ గవర్నర్ దొడ్ల భరత్‌కుమార్‌రెడ్డి హాజరయ్యారు.

### సౌత్‌స్టేషన్‌లో సమస్యలు

నెల్లూరు సౌత్ రైల్వే స్టేషన్‌లో రైళ్ళెక్కే ప్రయాణీకులు పలు సమస్యలను ఎదుర్కొంటున్నారు. ఈ రైల్వే స్టేషన్ ఫత్తేఖాన్‌పేట, ఆర్టీసి బస్టాండ్, బార్డీ హాస్పిటల్, వి.ఆర్. కాలేజి సెంటర్, రామలింగాపురం, హరనాథపురం, ఆదిత్య నగర్ ప్రాంతాల ప్రజలకు ఎంతో దగ్గరగా వుంది. ఇక్కడ నుండి 500 మందికి పైగా ప్రయాణీకులు నిత్యం రాకపోకలు సాగిస్తున్నా స్టేషన్‌లో కనీస సౌకర్యాలు లేవు. ప్లాట్‌ఫారం ఎత్తు తక్కువ, ముళ్లపొదలు, మంచినీటి, మరుగుదొడ్ల తోపాటు షెడ్‌లైట్ల సౌకర్యం లేదు.

ఎమ్పీగారు కాస్త తీరిక చూసుకొని ఈ స్టేషన్‌ను ఒకసారి సందర్శించి కనీస సౌకర్యాలు కల్పించండి

### తపాల ఉద్యోగుల దీక్షలు

అఖిల భారత తపాల ఉద్యోగుల సంఘాలు, జాతీయ తపాలా ఉద్యోగుల ఫెడరేషన్ పిలుపు మేరకు తపాల ఉద్యోగులు 23, 24తేదీల్లో నెల్లూరు పెద్ద పోస్టాఫీసులో సామూహిక నిరాహార దీక్షలు చేశారు. దీక్షలకు సిఐటియు నాయకుడు రామసుబ్బారెడ్డి, పిఐయు నాయకుడు షేక్ హుమయూన్ వీటికి నాయకత్వం వహించారు. తమ సమస్యలు పరిష్కరించకుంటే డిశంబర్ 5తేది నుంచి నిరవధిక సమ్మె చేస్తామంటున్నారు తపాల ఉద్యోగులు.

### మరణాలు

బూదనంలో పెద్ద రైతు, వివాద రహితుడు, జమీన్‌రైతు అభిమాని ఈదూరు శ్రీహరినాయుడు (83) 22తేది మరణించారు. శ్రీహరి నాయుడు నల్లపరెడ్డి వర్గీయుడు. 25ఏళ్ల పాటు బూదనం కో ఆపరేటివ్ సొసైటీ అధ్యక్షునిగా రెండు సార్లు ల్యాండ్ మార్టగేజ్ బ్యాంక్ డైరక్టర్‌గా పని చేశారు. ఆయనకు ఒక కుమార్తె - కుమారుడున్నారు.

***

పదేళ్లపాటు కొడవలూరు మండలం బసవాయపాళెం సర్పంచ్‌గా పని



చేసి, ప్రస్తుతం మద్రాసు నివాసిగా వున్న కామిరెడ్డి వెంకారెడ్డి (68) విజయా ఆసుపత్రిలో చికిత్స పొందుతూ 18తేది మరణించారు. వెంకారెడ్డి నిత్య కాంగ్రెస్ వాది. 1969లో కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్ డైరక్టర్‌గా పనిచేశారు.

పై రెండు కుటుంబాల వారికి మా సానుభూతి.

## సోపానాలు

6వ పేజీ కొరవ

ప్రజాసమస్యలపై ఆయన స్పందించే తీరు, వర్తమాన రాజకీయాలను ఆకళింపు చేసుకొనే విధానం, విలక్షణమైంది. పార్టీ పట్ల అంకుఠిత విశ్వాసం, సిద్ధాంతాలపై నిబద్ధత, ఆయనకు కేంద్ర మంత్రిత్వాన్ని ప్రసాదించింది.


జమీన్‌రైతు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 100/- |
| విదేశాలకు | రూ. 650/- |

విడిప్రతి రూ. 2/-

# జిల్లావార్తలు

8వ పేజీ తరువాయి

వియోజకవర్గాన్ని ఆదర్శవంతంగా తీర్చిదిద్దేందుకు తనవంతు కృషి చేస్తున్నారు. రోడ్ల వసతి, మంచినీటి సౌకర్యం, సాగునీటి వనరుల పెంపుదల తదితర కార్యక్రమాల నిర్వహణలో నిధులను సేకరించి అల్లూరును అభివృద్ధి పథంలో ముందుకు పోగేందుకు కృషి చేస్తున్నారు. దీనికి ప్రజల సహకారంతో పాటు ప్రభుత్వ అధికారుల కృషి కూడా అవసరమన్నారు. తెలుగుదేశం నాయకులు బీదా రవిచంద్ర, గోవర్ధనరెడ్డి, అల్లంపాటి సీతారామిరెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

ప్రస్తుత సమాజానికి పోలీసులే ప్రాణమని గూడూరు ఆర్డీఓ కె. సుబ్రహ్మణ్యం రెడ్డి అన్నారు. 21తేది పోలీసు అమరవీరుల సంస్మరణ దినోత్సవాన్ని పురస్కరించుకొని గూడూరు రూరల్ పోలీస్ స్టేషన్ ఆవరణలో జరిగిన సభలో మాట్లాడారు. ప్రజలతో సన్నిహిత సంబంధాలను పెంచుకొని తమ విధిని పోలీసులు నిర్వర్తించిన నాడు ప్రజల్లో గౌరవం పొందుతారన్నారు. డిఎస్పీ జనార్ధన్ మాట్లాడుతూ పోలీసులు సమాజంలో ఒక భాగమని, ప్రజలు తమ సమస్యలు నిర్భయంగా పోలీస్ స్టేషన్‌కు వచ్చి చెప్పుకోవచ్చున్నారు. గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్‌రావు, మునిసిపల్ ఛైర్మన్ కోడూరు కల్పలత, రెడ్‌క్రాస్ డాక్టర్ కృష్ణారెడ్డి, ఎస్‌బిఐ విజయకుమార్‌రెడ్డి, జి.శ్రీనివాసరావు ఈ కార్యక్రమంలో పాల్గొని ప్రసంగించారు. అనంతరం పోలీసులు రక్తదానం చేశారు.

## పౌష్టికాహార కోటా ఎక్కువ చేయాలి

ప్రాథమిక విద్యా భ్యాసం చేసే విద్యార్థులకు జాతీయ పౌష్టికాహార పథకం క్రింద అందజేసే బియ్యం, గోధుమల కోటాను పెంచాలని బిజెపి క్రియాశీలక సభ్యుడు నెల్లూరు సుధాకర్ కోరుతున్నారు. ప్రస్తుతమున్న 3కిలోల కోటా విద్యార్థులకు ఏ మాత్రం చాలదని, దీన్ని ఆరుకేజీలకు పెంచాలని ప్రధానమంత్రికి పంపిన వినతి పత్రంలో కోరారు.

## గూడూరు మున్సిపాలిటీకి కొత్త కమీషనర్

గూడూరు మున్సిపాలిటీకి కొత్త కమీషనర్‌గా అజయ్‌కిషోర్ నియమితులయ్యారు. ఇక్కడ కమీషనర్‌గా పనిచేస్తుండిన కె.వి.రమణ అనారోగ్య కారణాల వల్ల బదిలీపై వెళ్లడంతో, కొత్త కమీషనర్‌ను నియమించారు. కమీషనర్ అజయ్ కిషోర్‌కు బాపట్లలో సస్పెండ్ అయిన ఘనత వుంది. అదేమిటోగానీ ఘనతర చరిత్రలు గల వారే గూడూరు మునిసిపల్ కమీషనర్లుగా నియమితులవుతారు.

## కనుపూరు కాల్వకు నీరు వదలలేదు

కనుపూరు కాల్వకు నీళ్లు వదలక పోవడం వల్ల ఈ కాల్వ పారుదల క్రిందగల రైతులు ఇబ్బందులు పడుతున్నారు. ఇటీవల కురిసిన కొద్దిపాటి వర్షాలకు తాము నార్లు పోసుకొన్నామని, చేతకు నీరులేకపోవడం వల్ల కష్టాలు ప్రారంభమయ్యాయంటున్నారు. సోమశిలలో నీరుండి గూడా కాల్వకు నీరు వదలక పోవడం పట్ల ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. ఈ నెల 31తేదిలోగా నీరు వదలకపోతే 1తేది నెల్లూరులోని పి.డబ్ల్యు.డి కార్యాలయాన్ని ముట్టడిస్తామంటున్నారు.



మునిసిపల్ వైస్‌ఛైర్మన్‌కు షౌకాత్ రావడాన్ని నిరసిస్తూ కలెక్టరేట్ వద్ద ధర్నా చేస్తున్న కాంగ్రెస్ నాయకుల బృందం. మాట్లాడుతున్నది ఎమ్మెల్యే వివేకానంద రెడ్డి.

## పెండింగ్ ఫోన్లకు మార్చిలో మోక్షం

జిల్లాలో ప్రస్తుతం టెలిఫోన్ల కోసం దరఖాస్తులు చేసుకొని పెండింగ్‌లో వున్న 19వేల మందికి వచ్చే యేదాది మార్చిలోగా కొత్త కనెక్షన్లు ఇస్తామని ఎమ్మెల్యే డాక్టర్ ఉక్కాల రాజేశ్వరమ్మ చెప్పారు. 22తేది బుచ్చిలో విలేఖరులతో మాట్లాడుతూ జిల్లాలో టెలికాం వ్యవస్థను ఆధునీకరించేందుకు ప్రత్యేక చర్యలు తీసుకొంటున్నట్లు చెప్పారు.

## గౌరవరం హెడ్మాస్టర్‌కు అవార్డు

కావలి రూరల్ మండలం గౌరవరం ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడు పెనుగోటి సుధాకర్ భారత్ ఎక్సలెన్సీ అవార్డుకు ఎంపికయ్యారు. విద్య, సామాజిక సేవలకు గుర్తింపుగా ఢిల్లీలోని ఫ్రెండ్‌షిప్ ఫోరం ఆఫ్ ఇండియా వారు ఈ అవార్డును సుధాకర్‌కు బహూకరిస్తారు. వచ్చే నెల 21తేది ఢిల్లీలో ఈ అవార్డును అందజేస్తారు.

## జిల్లా స్థాయిలో హిందీలో వ్యాసరచన పోటీలు

సైదాపురం మండలం, తుమ్మల తలుపూరులోని మైకా కార్మిక సంక్షేమ శాఖ ఉన్నత పాఠశాలలో బాలల దినోత్సవాన్ని పురస్కరించుకొని హిందీలో వ్యాసరచన పోటీలు నిర్వహిస్తున్నారు. పోటీల్లో 8,9, 10 తరగతులు చదివే విద్యార్థులు పాల్గొనవచ్చు. వ్యాసం వ్రాయాల్సిన అంశం 'ఆజ్ కే బాలక్ కల్ కే నాగరిక్ హై'. వ్యాసాలను పుల్ స్కేప్ తెల్లకాగితంపై పేజికి మించకుండా వ్రాసి నవంబర్ 7తేదిలోగా పోస్ట్ ద్వారా పంపాలి. ఈ పోటీల్లో గెలుపొందిన 10 మంది విద్యార్థులకు బహుమతులు నవంబర్ 14తేది తుమ్మల తలుపూరు హైస్కూల్‌లో జరిగే బాలల దినోత్సవంలో బహూకరించబడతాయి. వ్యాసాలను టి.మల్లిఖార్జున్, గ్రేడ్ -1 హిందీపండిట్, హైస్కూల్, తలుపూరు - 524 409 చిరునామాకు పంపాలి.*

## నాయుడు

మొదటి పేజీ తరువాయి

పని చేయవల్సిన బాధ్యత పైన పడిందిప్పుడు. ఆయన నోటికి తాళం పడింది; చేతికి స్వేచ్ఛ వచ్చింది. వెంకయ్య నాయుడు గారికి ఈ రెండిటి మధ్య వ్యత్యాసం బాగా తెలుసు. అందువల్లే ఆయన మంత్రిత్వం తీసుకోవడానికి మొదట భయపడ్డారు కూడా. పార్టీ పదవిలో కొనసాగడమా లేక ప్రభుత్వంలోకి వలస వెళ్లడమా అనే వూగిసలాట నడిచింది. కాని ప్రధాన మంత్రి వాజ్‌పాయి వత్తిడి ఎక్కువ కావడంతో తక్కెడ మంత్రిత్వం వైపు తూగింది. పార్టీ పదవిలో వుంటే పార్టీ అవసరాలు తీర్చడం వరకే బాధ్యత. కాని ప్రభుత్వంలోకి వస్తే ప్రజలకు జవాబుదారీగా వుండక తప్పదు.

పదవి ఎంత పెద్దదైతే ప్రజలు అంత పెద్ద ఆశలు పెంచుకోవడం సహజం. నెల్లూరులో రేపు జరగబోయే సభలు, సన్మానాలు; స్వాగత సంబరాల వెనుక కూడా అటువంటి ఆశలు, ఆకాంక్షలు వున్నాయి. తన మెడలో పడే ప్రతి పూల మాల వెనుక ఒక కోరిక దాగివుంటుందన్న నిజం తెలుసుకోవడమ వసరం. కోరిక వ్యక్తిగతమైతే సున్నితంగా తిరస్కరించవచ్చు; కాని అది సామాజిక పరమైనదైతే తప్పించుకొనే అవకాశం ఆయనకు వుండదు. జిల్లాకు ఏమి చేస్తాడు అనే ప్రశ్న ప్రతి నెల్లూరీయుడిలో వినిపిస్తున్నది. ఏమి చేయగలను అనేది తేల్చుకోవల్సిన బాధ్యత ఆయనదే. ఢిల్లీ మంత్రిగా ఆయన నెల్లూరుకు పరిమితం కావాలని ఎవరూ కోరరు; కాని, స్వంత వూరికి మేలు చేయలేని వాడు దేశానికి ఎట్లా ఉపయోగపడగలడు, అన్న ప్రశ్న ఇక్కడ సందర్భోచితం. నేరుగా అడగ డానికి సాధారణ జనం సాహసించ లేకపోవచ్చు; కాని రచ్చ బండల మీద ఆ చర్చ జరగకుండా నిల్పడం ఎవరి తరమూ కాదు. రాజకీయ వాదికి చరిత్రలో లభించే స్థానాన్ని నిర్ణయించేది రచ్చ బండలే.

నెల్లూరుకు రాబోయే ముందు నాయుడు గారు ఈ విషయాలు మనసు లో పెట్టుకోవాలి. నెల్లూరు ప్రజల ఆశలు, ఆకాంక్షలు ఏమిటో ఆయనకు ఒకరు చెప్పవల్సిన అవసరం లేదు. జిల్లాలోని ప్రత్యణువు ఆయనకు సుపరిచితమే. జిల్లా ప్రజలు చిరకాలం తన పదవిని, తనను గుర్తుపెట్టుకునే మహత్కార్యం ఒకటి అయినా ఆయన చేయాలి; చేసేందుకు ప్రయత్నించాలి. అప్పుడే ఆయనను నెల్లూరీయులు మన నాయుడుగా పిలుస్తారు; లేకుంటే మంత్రి నాయుడుగా స్వాగతించి, ఆ తర్వాత మర్చిపోతారు. నిష్ఠురంగా కన్పించినా నిజం ఇదే!

***

వెంకయ్య నాయుడు గారి మంత్రిత్వం చాలా విస్తృతమైనది. ఆయన బడ్జెట్ మన రాష్ట్ర బడ్జెట్ కంటే పెద్దది. రక్షణ మంత్రిత్వ శాఖ తర్వాత కేంద్ర నిధులలో అత్యధిక కేటాయింపు జరిగేది ఈ విభాగానికే. ఆ శాఖ పరిధి కూడా చాలా విశాలమైనది. పల్లెటూళ్లకు సంబంధించిన ప్రతి పని ఇందుల భాగమే. నాయుడు గారు తలచుకొంటే చేయలేని పని అంటు ఏదీ లేదు. నిధుల కొరత లేదు. నిజానికి ఈ శాఖ మంజూరు చేసే డబ్బు ఖర్చు పెట్టలేక రాష్ట్రాలు అలసి పోతున్నాయి. చాలా రాష్ట్రాలు ఏడాది చివరలో డబ్బు వాపసు చేస్తున్నాయి. విచిత్రమేమిటంటే, మన రాష్ట్రం ఇప్పటి వరకు ఈ శాఖ ద్వారా లభించే నిధులను వాడుకొనే లేదు. తమిళనాడు ప్రభుత్వం ఈ ఏడాది ఈ శాఖ ద్వారా 360 కోట్ల రూపాయల విలువైన గ్రామీణ రోడ్లు మంజూరు చేయించుకున్నది. కాని ఆంధ్రప్రదేశ్ నుంచి ఒక్క ప్రతిపాదన కూడా రాలేదట. ఇంత కాలం కేవలం ఉత్తరాది రాష్ట్రాలు మాత్రమే నిధులన్నిటిని తరలించుకుని వెళ్తుండినాయి. నాయుడు గారు వచ్చారు కాబట్టి ఇక నుంచి మనం కోరినన్ని నిధులు తెచ్చుకోవచ్చు.*

## చిత్రసమీక్ష

17వ పేజీ తరువాయి

ఊరి ఉలుకుతుంది. దాన్ని ప్రేమగా తీర్చి మన్మధ బాణం చేసి మధుమీదికి సంధించాలను కుంటాడు. జలక మాదిన ముత్యంలా ముచ్చటగా ముస్తాబై నిత్యమూ సత్యంగా మెరుస్తున్న ఆమె స్నేహం తాను ప్రేమను వెల్లడించటంతో తనకు దూరమై పోతుందని భయపడు తాడు.

చీకూ చింతా లేకుండా పండగ లాంటి జీవితం సాగిస్తున్న మధు జీవితంలో ఒక చింత సందు చేసుకుంటుంది. ఆమె కాలేజీలోనే 'లా' చదువుతున్న ప్రకాష్ ఆమె అందచందాలకు మురిసి ఆమెను పెళ్లి చేసుకొనేందుకు అతని తల్లి దండ్రుల ద్వారా ప్రయత్నిస్తాడు. ప్రసాద్‌ను పెళ్లి చేసుకుంటే తరుణ్ పట్ల తన స్నేహానికి స్వస్తి చెప్పవలసి వస్తుందని మధు భయపడుతుంది. కాని తల్లిదండ్రుల ఒత్తిడితో ప్రసాద్‌తో పెళ్లికి అంగీకరించక తప్ప లేదు. మధు స్నేహం బంధం తెగిపోతుందేమోనని తరుణ్ బాధపడతాడు. చిన్ననాటి నుంచి ఒకే చోట ఒకే బాటలో స్వచ్ఛంగా, బలంగా ఎదిగిన స్నేహం గెలవటం సహజం కదా! ఇదే చిత్రానికి పతాకసన్నివేశం.

ప్రేమ పిచ్చిలో పడి వింతపోకడలతో విరివిగా చిత్రాలు తయారవుతుండే ఈ తరుణంలో స్నేహానికి ప్రాముఖ్యత నిచ్చి, పిల్లల్లోనే కాదు వారి పెద్దల్లోను స్నేహ బంధం కుదిర్చి ఎక్కడా స్నేహం ప్రేమ పిచ్చిలోకి చొరనీకుండా స్నేహానికి గౌరవాన్ని, బలాన్ని కూర్చి చిత్రాన్ని ఆకర్షణీయంగా విజయవంతంగా రూపొందించిన దర్శకుడు విజయభాస్కర్ అన్ని విధాలా అభినందనీయుడు. త్రివిక్రమ్ మాటలు పాత్రలను బాగా నడిపించాయి. సిరివెన్నెల, భువనచంద్ర వ్రాసిన పాటలు కోటి సంగీతంలో పులకింపచేస్తాయి. హరి అనుమోలు కెమెరా తీరూ తెన్నూ ప్రశంసనీయం.*



దీపావళిని పురస్కరించుకొని హాస్టల్ విద్యార్థులకు, విద్యార్థులకు స్వీట్స్ టపాసులు పంపిణీ చేసే కార్యక్రమాన్ని జ్యోతి వెలిగించి ప్రారంభిస్తున్న కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, కలెక్టర్ సతీమణి సునీత, ఎస్పీ శ్రీనివాసరెడ్డి వున్నారు.

# ఆదాల ఏడాదిపాలనలో

## 20 కోట్లతో అల్లూరు నియోజకవర్గ అభివృద్ధి













**ఏడాదిలో అల్లూరు నియోజకవర్గంలో అభివృద్ధి కార్యక్రమాలు**

| | |
|---|---|
| **పంచాయితీ రాజ్ శాఖ** | |
| స్కూలు భవనాలు | 148.33 లక్షలు |
| రోడ్లు | 265.09 లక్షలు |
| ఎం.పి. లాడ్స్ | 28.35 లక్షలు |
| పాల కేంద్రాలు, పశువైద్యశాలలు, రీడింగ్ రూములు | 41.38 లక్షలు |
| **R.W.S. (రూరల్ వాటర్ సప్లైస్కీమ్స్)** | |
| వాటర్ ట్యాంక్‌లు, పైప్‌లైన్లు, బోర్లు | 183.50 లక్షలు |
| **హౌసింగ్** | |
| 3125 గృహాలు | 555.000 లక్షలు |
| **ఇరిగేషన్** | |
| నీరు - మీరు | 41.75 లక్షలు |
| కరువు పనులు | 19.93 లక్షలు |
| చెరువుల రిపేర్లు | 25.57 లక్షలు |
| స్పెషల్ ఫండ్స్ | 6.52 లక్షలు |
| F.D.R. ఫండ్స్ | 12.50 లక్షలు |
| E.A.S. గ్రాంట్ | 48.63 లక్షలు |
| డ్రైన్లు | 108.92 లక్షలు |
| బ్రిడ్జీలు | 64.48 లక్షలు |





మా ప్రియతమ నాయకులు

# శ్రీ ఆదాల ప్రభాకర్ రెడ్డి గారు

రాష్ట్ర గృహనిర్మాణ శాఖామాత్యులుగా పదవిని చేపట్టి ఏడాదికాలం పూర్తి చేసుకున్న శుభసందర్భంగా వారికి

మా హృదయపూర్వక శుభాకాంక్షలు...

## అల్లూరు తీరప్రాంత ప్రజల దాహార్తికి ముఖ్యమంత్రి వరం 5 కోట్లు

**జీద రవిచంద్ర**
అల్లూరు మండల కన్వీనర్

**కండ్లగుంట మధుబాబు నాయుడు**
బోగోలు మండల కన్వీనర్

**మాలెపాటి సుబ్బానాయుడు**
దగదర్తి మండల కన్వీనర్

**ఎర్రంరెడ్డి గోవర్ధనరెడ్డి**
బుచ్చి మండల కన్వీనర్

**దేవిరెడ్డి శ్రీనివాసులు రెడ్డి**
వైస్ ఛైర్మన్, కోవూరు షుగర్ ఫ్యాక్టరీ

# సింహపురి నాటప్రసిద్ధి-రాపూరు కోట!

విజయనగర సామ్రాజ్య కాలంలో, వెలుగోటి యాచమనాయకుని ఆధ్వర్యంలో టంకశాలగా, `ఖజానా'గా వాజ్యల్యంగా వెలుగొందిన రాపూరు కోటకు ఆ తర్వాత కాలంలో వెలుగు నీడలు ప్రాప్తించడానికిగల వాస్తు పరిణామాల్ని చూద్దాం!

రాపూరు కోటను వెంకటగిరి వంశస్థుడైన వెలుగోటి యాచమనాయకుడు క్రీ.శ. 1585 - 1614లో సుదృఢమైన దుర్గంగా నిర్మించాడని ప్రతీతి. ఇతను శ్రీ కృష్ణదేవరాయల మనుమడైన ఆర్వీటి రెండవ వెంకటపతి దేవరాయల సేనాని. మహావీరుడు. అంతకు మించి రాజభక్తుడు. క్రీ.శ. 1614 తర్వాత కూడా కుట్రదారులైన జగ్గరాయల వంటి వారిని శిక్షించి `రాయసింహాసనాన్ని' కాపాడిన మహావీరుడు.

*రాపూరు ఖజానా!*

రాపూరు అటవీ ప్రాంతాల సమ్మేళనం. అంచేతనూ, పశ్చిమాన పర్వత పంక్తుల రక్షణ వల్ల ఈ కోటను

**వాస్తుసంగతులు**
**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**

టంకశాలగానూ, ఖజానాగాను ఉపయోగించారు. సుమారు 20-25 అడుగుల ఎత్తయిన కోట గోడలు సుదృఢమైనవి. గోడలపైన సైనికులు కవాతు చేసేవారు.

ఈ కోట గోడల వెడల్పు 12 - 15 అడుగులు. కోట విస్తీర్ణం దాదాపు 25 - 50 ఎకరాలు. చుట్టూ విశాలమైన లోతైన కందకం వుండేది. ఇందులో మొసళ్లను పెంచేవారు.

కోట లోపల అనేక కట్టడాలుండేవి. ఇది కేవలం రక్షణ దుర్గంగా ఉపయోగించేవారని, జనవాసాలు, అధికార నివాసాలు కోట బయట వుండేవని చరిత్రకారులు చెబుతున్నారు.

ఈ కోటలో `ధనాగారం' తోబాటు `ముద్రణాగారం' కూడా వుండేది. వీటి రక్షణ కోసం ఇక్కడ `పాళెగారు' కాపుండేవారు. ఇతనికి 500 అశ్వికదళం, 2000 పదాతిదళం నిత్యం కనుసన్నల్లో మెలిగేవి. అయితే ఈ ప్రాంతంలో చెంచుల దోపిడిలు కూడా ఎక్కువగానే వుండేవి. చెంచులు గోనుపల్లి, వెలంపల్లి, రాపూరు ప్రాంత చుట్టు ప్రక్కల దోపిడిలకు పాల్పడేవారు. అందువల్ల ఈ దోపిడిలను అరికట్టాల్సిన బాధ్యత కూడా సైన్యంపై ఉండేది.

*కోట చరిత్ర!*

విజయనగరం తర్వాత కోట గోల్కొండ, కర్నాటక నవాబుల స్వాధీనమయింది. గోల్కొండ పాలన కాలంలో `చిన్న గంగమనాయకుడు' కోట పాళెగారుగా వుండే వాడు. ఇతనే చెంచు మూకల్ని చీల్చి చెండాడాడు.

రాపూరు ధనాగారాన్ని రక్షిస్తూ ఇక్కడి వార్తలను పంపడానికి గోల్కొండ నవాబులు ఆ తర్వాత `తాడిబోయిన రామానాయుడును' నియమించారు. ఇతనికి `పుల్లికోలుపాడు' ఇనాందారీ గ్రామం. ఇతని కాలంలో మహారాష్ట్ర దండయాత్రలు జరుగగా ఇతను వెలుగొండలలోకి పారిపోయాడు. సైన్యం అతడ్ని వెంబడించి అతని ధనాన్ని, అధికార పత్రాన్ని స్వాధీనం చేసుకున్నారు. ఈ సంఘటన క్రీ.శ 1672 - 87లో జరిగి వుండాలి. ఎందుకంటే ఛత్రపతి శివాజీ గోల్కొండ ప్రభువు అబుల్‌హసన్ తానీషాతో ఈ సమయంలోనే `సంధి' చేసుకున్నాడు.

క్రీ.శ. 1640 - 50 ప్రాంతాల్లో రాపూరు ఉదయగిరి రాజ్యపరిధిలో వుండేది. అయితే ఈ మధ్యకాలంలో రాపూరు కోట చాలా ఆటు పోటులకు గురయ్యింది. క్రీ.శ. 1642 ఏప్రిల్ 21న గోల్కొండ సైన్యం మీర్‌జుమ్లా నాయకత్వంలో శ్రీహరికోటను ముట్టడించి, అక్కడి నుంచి వెంకటాద్రి, తిమ్మారెడ్డి నాయకత్వంలో రాపూరు కోటను ముట్టడించి డిసెంబరు ప్రాంతంలో కోటను వశపరచుకుంది.

క్రీ.శ. 1686లో అక్కన్న, మాదన్నల `హత్య' తర్వాత తానీషా బందీ అయ్యాడు. మొఘలులు గోల్కొండను ఆక్రమించుకున్నారు. మొఘలులకు అనుకూలంగా వున్నందుకు వారు వెంకటగిరి ప్రభువుకు రాపూరుతో బాటు మరికొన్ని కోటలను ధారాదత్తం చేశారు. రాపూరు కోటకు చివరి పాలకుడు `అబ్దుల్ మెహబెత్ పంషేర్ జంగ్'. ఇతని తర్వాత పాలకుల వివరాలు చరిత్రకు తెలియవు.

*శిథిల దుర్గం*

కోట చారిత్రక ప్రశస్తిని గమనించిన పురావస్తు శాఖ కొంత కాలం కోటను తమ ఆధీనంలో వుంచుకొంది. ఆ తర్వాత కోట వాతావరణం తాకిడులకు శిథిలం కాగా, ప్రజలు తమ చేత అయినంత వరకు కోటను మరింత శిథిలం చేశారు. అక్కడి రాళ్లు గృహనిర్మాణాలకు నిర్విరామంగా దోపిడి అవుతున్నాయి. ఆ తర్వాత ఒక మత వర్గం ఈ ప్రాంతాన్నిస్వాధీనపరచుకొని `గోరీల' మిట్టగా చేసింది.

కోట లోపల `సీతాఫలం' మొక్కలు, శిథిల కట్టడాలు మిగిలాయి. చారిత్రక ప్రాంతాల పట్ల మన అశ్రద్ధకు ప్రత్యక్ష సాక్ష్యం రాపూరు కోట.

*వాస్తు ద్వంద్వ ప్రవృత్తి!*

రాపూరు కోటకు తూర్పు అగత్త ఆ తర్వాత పల్లపు భూములు పశ్చిమం చెరువు. వెలిగొండలు; ఉత్తరం రాపూరు పట్టణం, రాపూరమ్మ దేవాలయం, దక్షిణం ఖాళీ ప్రాంతం, అటవీ ప్రాంతం ఎల్లలు.

కోట చుట్టూ అగత్త `లంకను' గుర్తుకు తెస్తుంది. తూర్పు ఇంద్రస్థానం, పశ్చిమాన వరుణ స్థానం, పశ్చిమ వాయువ్య ద్వారం ఇవన్నీ కూడా ప్రారంభంలో యాచమనాయకుడికి `దిశాప్రాభవాన్ని' కలిగించాయి. ఫలితంగా క్రీ.శ. 1585 - 1625లో పశ్చిమ వాయువ్య దిశాఫలితం వల్ల నాయకుడూ, కోట ఉచ్ఛస్థితిలోకి వెళ్లాయి.

పశ్చిమ `వరుణ స్థానం' చెరువు వల్ల, ఉత్తర `కుబేరస్థానం' పీడనం వల్ల, కోట పాలనా వ్యవహారాల్లో హెచ్చు తగ్గులు ఏర్పడ్డాయి.

`ద్వీపం' కోట కావడం వల్ల దక్షిణ, పశ్చిమాదిశం యమ, వరుణ పీడనలు కలుగుతాయి. ఫలితంగా కోట శిథిలం అనివార్యమయ్యింది. మళ్లీ ఆ స్థానంలో `కోటలు నిర్మాణం' రాకపోవడానికి, తిరిగి ఉచ్ఛస్థితి రాకపోవడానికి `యమ స్థానం' పీడన కీలకమవుతున్నది.

పశ్చిమ ద్వారం కలిగిన ఈ కోటకు `దక్షిణ దిశా రహస్య ద్వారాలు' ఈ స్థితికి కారణం.

కాలచక్ర భ్రమణంలో వాస్తు ప్రభావాల్ని ఎదురించగల శక్తి ఏదీ లేదు. ఒక్క దైవ శక్తికి తప్ప. అలాంటి చల్లటి చూపులు గల కోటలే నేడు `యాత్రిక స్థలాలై' జన సందోహాలతో కళకళలాడుతుంటాయి. *

## గ్లీన్‌గ్లోరీ

8వ పేజీ తరువాయి

విజయభాస్కర్‌ను ఎఎస్పీ రవికుమార్ ఆదేశించారు. కానీ ఈ ఎస్ఐ కూడా ఈ స్కీమ్‌లో సభ్యుడని తెలుసుకొని జిల్లా ఎస్పీ ఐడి పార్టీకి ఈ దర్యాప్తు బాధ్యతలు అప్పచెప్పారు. అయితే గ్రీన్ గ్లోరీ బ్రదర్స్‌ను పట్టుకోవద్దని ఈ కేసును నీరుగార్చమని గతంలో ఇక్కడ ఎస్పీ, ఎఎస్పీగా పనిచేసిన వెళ్లిన అధికారులు వీరిపై వత్తిడి తెస్తున్నట్లు తెలిసింది. ముఖ్యమంత్రి దృష్టికి ఈ వ్యవహారం వెళ్లడంతో ఆయన దర్యాప్తు ఆదేశించిన మరునటి రోజే గ్రీన్‌గ్లోరి బ్రదర్స్ ఇక్కడ నుంచిబిచాణా ఎత్తడం వెనుక పోలీసు అధికారుల హస్తమున్నట్లు తెలుస్తుంది. ఒకటిన్నర నెల నుంచి పోలీసులు తూతూ మంత్రపు దర్యాప్తును కొనసాగిస్తున్నారు. గ్రీన్‌గ్లోరి బ్రదర్స్ తమ సామాన్లు వేసుకొని వెళ్లిన లారీలను పోలీసులు గుర్తించారు. వాల్గవ పట్టణ పోలీస్ స్టేషన్ ఎదురుగావున్న ఆక్షన్ హాలు యజమానికి గ్రీన్‌గ్లోరి బ్రదర్స్‌కు దగ్గర సంబంధాలున్నాయి. కాని ఇంత వరకు అతన్ని పోలీసులు మాటవరుసకైనా విచారించలేదు. ఇటీవల గ్రీన్ గ్లోరి బ్రదర్స్ హైదరాబాద్ వెళ్లి మాజీ ఎస్పీ నరసయ్య, ఎఎస్పీ కుమార్‌లను కలసినట్లు విశ్వసనీయంగా తెలిసింది. ఈ పోలీసు అధికారులు వీరిని కోర్టు ద్వారా బెయిల్ తీసుకోమని సలహా ఇచ్చినట్లు తెలిసింది. ఐడి పార్టీ పోలీసులతోను గ్రీన్‌గ్లోరి బ్రదర్స్‌కు సంబంధం వుండడం వల్ల ఈ దర్యాప్తు నత్తనడక నడవడం ఖాయం. కొత్త ఎస్పీ శ్రీనివాసులురెడ్డి ఈ కేసు విచారణకు కాస్త దమ్మున్న అధికారులను నియమిస్తే ఎన్నో పోలీసు కుటుంబాలను ఆదుకొన్నవారవుతారు.




తమ సమస్యల పరిష్కారం కోసం నిరాహార దీక్ష చేస్తున్న గూడూరు తపాలా ఉద్యోగులు.

## మూతబడ్డ గిరిజన వికాస కేంద్రాలు

నిరక్షరాస్యులైన గిరిజనుల జీవితాల్లో వెలుగు నింపను ప్రారంభించిన గిరిజన విజ్ఞాన వికాస కేంద్రాలు మూతబడ్డాయి. సైదాపురం మండలం రామ్‌నగర్, సముద్రాల కండ్రిగ, చావతిప్ప, గిరిజన కాలనీల్లో గిరిజన వికాస విజ్ఞాన కేంద్రాలను ప్రారంభించారు. జూలై నెలలో ఈ కేంద్రాలకు ఉపాధ్యాయులను డిప్యూటేషన్‌పై నియమించారు. దసరా శెలవలతో ఈ డిప్యూటేషన్ కాలం పూర్తవ్వడంతో వీరు తమ పూర్వపు పాఠశాలలకు వెళ్లిపోయారు. అప్పటి నుంచి గిరిజన విజ్ఞాన వికాస కేంద్రాలు మూతబడ్డాయి. వీరి చదువులు చతికిలబడ్డాయి. గిరిజనుల పిల్లలు ఎప్పటి మాదిరిగానే పనులకు పోవడం మొదలుపెట్టారు. మొత్తానికి ఈ ప్రత్యేక కార్యక్రమం మూన్నాళ్ల ముచ్చటయ్యింది. గిరిజనుల పిల్లలు స్కూళ్లకు వెళ్లేలా అనుబంధిత కార్యక్రమాన్ని అధికారులు రూపొందించాల్సి వుంది.

## బజారులో ఆరోగ్య కేంద్రం మందులు!

ఆత్మకూరు మండలంలోని మహిమలూరు ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి వస్తున్న మందులు దారిమళ్లుతున్నాయి. ప్రజలకివ్వాల్సిన మందులను ఇక్కడి డాక్టర్, సిబ్బంది కలసి మందుల షాపుల వారికి అమ్మేసి సొమ్ము చేసుకొంటున్నారు. ఈ ఆరోగ్య కేంద్రానికి మూడు నెలలకొకసారి 80వేల రూపాయలు విలువ చేసే మందులను ప్రభుత్వం సరఫరా చేస్తుంది. ఇక్కడ పనిచేసే ఎ.ఎన్.ఎంలు తమ ఆరోగ్య కేంద్రంపరిధిలోనికి వచ్చే గ్రామాల్లోని ఇళ్లకు వెళ్లి గ్రామస్తుల ఆరోగ్యాలను విచారించి, వారికి మందులిచ్చి రావాలి. తమ పరిశీలన స్థాయికి రోగాలు మించితే ఆత్మకూరు ప్రభుత్వాసుపత్రికి తీసుకొచ్చి చూపించాలి. కాని ఇక్కడ పనిచేసే సిబ్బంది ఆ పని ఎప్పుడో మానేశారు. ప్రభుత్వం ఇచ్చే మందులు రావడమే తరువాయి ఆత్మకూరులోని మందుల షాపుల్లోవిక్రయించి సొమ్ము చేసుకొంటున్నారు. గ్రామాల్లోని బావుల్లో క్లోరిన్ బిళ్లలు, బ్లీచింగ్ వేసే పనిని సిబ్బంది మానేశారు. వీటికోసమిస్తున్న నిధులను కూడా భోం చేస్తున్నారు. అత్యవసర సమయాల్లో రోగుల ప్రాణాలు కాపాడేందుకు కొన్ని మందులు బయట కొనుగోలు చేసేందుకు 10వేల రూపాయల వరకు బడ్జెట్ వుంది. దీన్ని కూడా నాటకీయంగా డ్రా చేసుకొంటున్నారు. ఆత్మకూరులోని ప్రైవేట్ ఆసుపత్రుల చుట్టూ తిరుగుతూ కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించుకొనేవారిని పసిగట్టి, తమ రికార్డుల్లోకి ఎక్కించుకొని ప్రత్యేక ఇంక్రిమెంట్లు కూడా ఇక్కడి సిబ్బంది కొట్టేస్తున్నారు. జిల్లాలో వైద్య ఆరోగ్యశాఖ పై నుంచి క్రింది వరకు గబ్బు పట్టిపోయి వుంది. అందువల్లే ఎవరికి సందు దొరికిన చోట వాళ్లు తినేస్తున్నారు.

## తాగునీటి కోసం కౌన్సిలర్ల ధర్నా

గూడూరులో మంచినీటి కోసం ప్రజలు కటకట లాడిపోతున్నారు. సమస్య పరిష్కరించడంలో మునిసిపాలిటి పూర్తిగా విఫలమై పోయింది. ఈ విషయంలో అధికారులు, ఛైర్మన్ నిర్లక్ష్య వైఖరిని నిరసిస్తూ 16 మంది కౌన్సిలర్లు 23తేది మునిసిపల్ కార్యాలయం ఎదుట ధర్నా చేశారు. మునిసిపల్ పరిధిలో వున్న బోర్ల రిపేర్లకు పబ్లిక్ హెల్త్ శాఖ లక్షా 60వేల రూపాయలు విలువ చేసే మెటీరియల్ రెండు నెలల క్రితం మునిసిపాలిటీకి అందజేసింది. కాని ఈ మెటీరియల్‌ను తాళం వేసి ఒక గదిలో పెట్టారుగాని రిపేర్లకు ప్రయత్నం చేయలేదు. నీటి సమస్య తీవ్రం కావడంతో ప్రజలు కౌన్సిలర్లను నిలదీస్తుండడంతో గుక్క తిప్పుకోలేక పోతున్నారు. స్థితిపరులైన కొందరు కౌన్సిలర్లు తమ స్వంత ఖర్చులతో బోర్లు రిపేర్లు చేయిస్తున్నారు. కౌన్సిలర్లు ధర్నా నిర్వహిస్తున్నారని తెలిసి మధ్యాహ్నం 3 గంటల ప్రాంతంలో ఛైర్మన్ కల్పలత శిబిరం వద్దకు వచ్చారు. తాను కూడా ధర్నాలో కూర్చొంటాననేసరికి కౌన్సిలర్లు ఒప్పుకోలేదు. ఛైర్మన్ చేసేదేమీ లేక అక్కడి నుంచి వెళ్లిపోయారు. కొందరు నాయకులు తనకు కౌన్సిలర్లకు మధ్య విభేదాలు రేకెత్తించను ధర్నాకు ఉసికొల్పారని కల్పలత ఆరోపించారు. ధర్నాలో కాంగ్రెస్ కౌన్సిలర్లు దందు మహేష్‌రెడ్డి, ఎస్వీ సుబ్బమ్మ, గారా సరస్వతి, సిహెచ్. శ్యాంప్రసాద్, నాశిన నాగులు, తెలుగుదేశం కౌన్సిలర్లు ఎస్.స్వర్ణలత, పి.సంధ్యారాణి, హబీబున్నీసా, జి. నారాయణమ్మ, నాజరుద్దీన్, సిపిఎం కౌన్సిలర్ పి.ఆదెమ్మ, ఇండిపెండెంట్ కౌన్సిలర్లు ఎన్.రమణారెడ్డి, గాయం వెంకట రమణయ్య, ఎన్. వెంకటరత్నం, వై. సుధాకర్, వై.దాస్ పాల్గొన్నారు.

# అక్కపాత్రలే బెస్ట్-అమ్మ పాత్రలొద్దు

అమ్మపాత్రలు పోషిస్తే మా ఆయన ఒప్పుకోనన్నారు అంది సుహాసిని. ఈ విషయమై వివరిస్తూ నువ్వు లక్షణంగా అక్కపాత్రలు, వదిన పాత్రలు చేసేట్టయితే నాకేమి అభ్యంతరం లేదు. అంతేకాని అమ్మపాత్రలు చేయడానికి ఒప్పుకొంటే నిన్ను మేడమీదించి నెట్టేస్తానని నన్ను మణిరత్నం బెదరించారు. అసలే మేముండేది మేడమీదే అని సుహాసిని చమత్కరించింది. వాస్తవంగా నాకు ఇన్‌స్పైరింగ్‌గా ఉండే పాత్రలే చేయాలని వుంది. అవి అక్క, వదిన పాత్రలైతే మరీ ఆనందం. నా వయసుకు

## సుహాసిని

తగినవిగా వుంటాయి. ఎప్పుడైనాసరే కథతో సంబంధం వుండే పెర్ఫామెన్స్ పాత్రల్ని చేస్తే వచ్చే ఆత్మసంతృప్తి, గుర్తింపు ఎనలేనివని వివరించింది.

## నిద్రపోను సమయం లేదు

జీవితంలో పరిస్థితుల మార్పు ఎప్పుడూ ఏ విధంగా వుంటుందో చెప్పలేమన్నారు మాటల రచయిత, నటుడైన ఎల్బీ శ్రీరాం. నా కాళ్లపై నేను నిలబడాలని డిగ్రీకాగానే ఇంట్లో నుంచి బయటకు వచ్చి 150 రూపాయల జీతానికి హైదరాబాద్‌లో ఒక ప్రైవేటు కంపెనీలో ఉద్యోగంలో చేరాను. అప్పుడు ఒక రేకుల గదిలో అద్దెకు వుండేవాడిని. ఆ గది ట్రాన్స్‌ఫార్మరును ఆసరా చేసుకొని ఆక్రమించి కట్టిన గది. అది ఎప్పుడు పేలుతుందోనని భయం. గది చిన్నది కావడం వల్ల పూర్తిగా కాళ్లు, చేతులు చాపుకొని పడుకోవడానికి ఇబ్బంది పడేవాడిని. దర్శకుడు ఇవివి సత్యనారాయణ దయవల్ల నా దశ తిరిగింది. ప్రస్తుతం చేతినిండుగా చిత్రాలే. స్వంత ఇల్లు, కారు కొన్నాను. విదేశాల్లో షూటింగులకు వెళ్లాను. బిజీ షెడ్యూళ్ల వల్ల ప్రస్తుతం నిద్రపోవడానికే సమయం దొరకడం లేదన్నారాయన. కాలం కలిసి వస్తే పరిస్థితులే మారిపోతాయంటున్నారు శ్రీరాం.

## దైవభక్తే కారణం

దైవంపై ఉండే భక్తి, ప్రియురాలిపై వుండే ప్రేమ రెండింటిలోనూ పవిత్రత ఉంటుంది. ఈ పవిత్రత నుంచే మైమరపించే సంగీతం ఉద్భవిస్తుందని సంగీత దర్శకుడు రెహమాన్ చెప్పారు. దైవ స్తుతి చేసేటప్పుడు కలిగే పారవశ్యం, ప్రియురాలిని స్మరిస్తూ కూనిరాగం తీసేటప్పుడు కలిగే పారవశ్యం ఒకే రకంగా వుంటాయి. ప్రతి దేవప్రార్థనా గీతం ఒక ప్రేమగీతానికి జన్మనిస్తుంది. స్వరకర్తకు దైవభక్తి వుంటే మంచి సంగీతం సమకూర్చగలడంటున్నారు రెహమాన్. తనకు ఈ రెండు లక్షణాలు ఉన్నాయంటున్నారాయన.



తెనాలి చిత్రంలో కమలహాసన్, జ్యోతిక

# శృంగార మల్లెకాజా 'మలైకా'

ఎంటివి లవ్‌లైన్ కార్యక్రమ నిర్వాహకురాలు మలైకా అరోరా ఏ విషయాన్నైనా కుండబద్దలు గొట్టినట్లు మాట్లాడుతుంది. భగవంతుడు నాకు అందమైన దేహ సౌందర్యం ఇచ్చాడు. నా కళ్లు క్రైపెక్కిస్తాయని, బుగ్గలు నిగనిగలాడుతుంటాయని, ఊరించే పెదాలు, నిండైన వక్ష సంపద వుంటుందని పలువురు చెబుతుంటారు. నా కళ్లకు సల్మాన్‌ఖాన్ సోదరుడు అర్బాజ్‌ఖాన్ నచ్చాడు. అతన్ని ప్రేమించి పెళ్లి చేసుకొన్నాను. నా భర్తకు నా ద్వారా లభించే సుఖాన్ని ఎంతగానో అందిస్తాను సిగ్గుపడను. భర్తను మించి దైవం మరొకటి లేదు. నా అందాన్ని పరిపూర్ణ స్థాయిలో నా భర్తకు సమర్పిస్తాను. అతనితో సెక్స్ పరంగా నేను ఎంతో హాయిగా సంతృప్తిగా వున్నాను. మొదటిసారి నా భర్తతో సెక్స్‌లో పాల్గొన్నప్పటి మధురానుభూతి అటువంటిది. మా ఇద్దరికీ మధ్య వున్న ప్రేమ మీరు పుస్తకాల్లో వ్రాసే ప్రేమ వంటిదని మలైకా చెబుతుంది. పెళ్లయినా అందం తరగక పోవడానికి నిత్యం ఆనందంగా ఉండడమే కారణమంటుంది. జీవితానికి సంబంధించిన ఏ విషయాలను కూడ దాచాల్సిన అవసరం లేదంటుంది.

## సరసుడు

హిందీ హీరో అక్షయ్‌కుమార్

## 'భర్త' ఆనందమే సర్వస్వం

మంచి సరసుడు. ప్రేమ - పెళ్లి పేర్లతో హీరోయిన్లను స్పీడ్‌గా మారుస్తుంటాడాయన. ముందుగా రవీనాతో ప్రేమ వ్యవహారాన్ని జోరుగా సాగించిన అక్షయ్. ఆ తర్వాత ఒకరిపై ఒకరు విసురు మాటలతో రాళ్లు రువ్వుకొనే స్థితి వరకు వెళ్లారు. ఆ తర్వాత ట్వింకిల్ ఖన్నాతో రాసలీలలు జోరుగా హుషారుగా సాగించాడు. ఈ మధ్య ధడ్కన్ చిత్రం షూటింగ్ కోసం స్విట్జర్లాండ్ వెళ్లిన శిల్పాశెట్టితో చెట్టాపట్టాలేసుకొని తిరిగాడట. అమాయకురాలు శిల్పా, అక్షయ తనకు దగ్గరయ్యాడని పత్రికల వారికి చెప్పింది. కాని అక్షయ్ మాత్రం నా జీవితంలోకి శిల్పను ఎవరో నెట్టుతున్నారనే భావన కలుగుతుందన్నాడు. ఒక రొమాంటిక్ సాంగ్ కోసం స్విట్జర్లాండ్ వెళ్లాం; రొమాన్స్ కోసం కాదు. ఆ పాటలో నేచురల్‌గా ఉండటం కోసం మేమిద్దరం ఎంతో కష్టపడ్డాం. అంత మాత్రాన ఏదేదో అంటే ఎలా అంటున్నాడు.

## అదృష్టమే కారణం

గ్లామర్ మీడియా అయిన సినీ పరిశ్రమలో తాను ఎక్స్‌పోజింగ్ చేయకుండా నిలదొక్కుకోవడానికి అదృష్టం, ప్రేక్షకుల ఆదరణ కారణమంటుంది సౌందర్య. అసలు సినిమాల్లో నటించడానికే ఇష్టపడని స్థితిలో నేను సినిమా

తొరువ 19వ పేజీలో

# నాకో మంచి మొగుడు కావాలి!

తమిళనాట కథానాయికగా ఒక ఊపు ఊపుతున్న జ్యోతిక తన మనసులోని మాటలు బయటపెట్టింది. గ్లామర్‌లేని తారల్ని ముంబై ప్రేక్షకులు ఆదరించరు. అక్కడి హీరోయిన్లంతా గ్లామర్ పాత్రలకు కూడా భారీగా మేకప్ చేసుకొంటారు. దక్షిణాది ప్రేక్షకులు అలా కాదు; కాస్త లావున్న హీరోయిన్లను ఆదరిస్తారు. బహుశా వుంటే నేను ఐదేళ్లు చిత్ర పరిశ్రమలో వుంటాను. నా కెరీర్ ఎంత ఉన్నతస్థాయిలో ఉన్నప్పటికీ - మంచి మనిషి తారసపడితే అతన్ని పెళ్లి చేసుకొంటాను. ఎక్కువ కాలం సినీరం

## హైదరాబాదు సినిమా వార్తలు

గాన్ని పట్టుకొని వుండే ఓపిక నాకు లేదు. ఈ పోటీ ప్రపంచంలో నాకు ఎవరి వల్లా నష్టం వాటిల్లదు. ఇక్కడ ఎవరిస్థాయి వారిదని వివరించింది.

## హీరోయిన్ల కొత్త వ్యాపారం

సినిమాల్లో సంపాదించే డబ్బును హీరో, హీరోయిన్లు పలు రంగాల్లో పెట్టుబడి పెడుతుంటారు. 'కహోనా ప్యార్‌హై' హీరోయిన్ అమీషాపటేల్, విశ్వసుందరి సుస్మితాసేన్ స్టాకు మార్కెట్ వైపు దృష్టిని సారించారట. వీరిద్దరు స్టాక్ మార్కెట్ ధరలను రోజూ పరిశీలించేందుకు ముంబాయి స్టాక్ మార్కెట్ వెళ్తున్నారు. మార్కెట్‌లో ఎగబ్రాకేందుకు పలువురు బుకీలను ఏర్పాటు చేసుకొన్నట్లు తెలిసింది.

## గాయనిగా మారిన జయప్రద

ఎమ్పీ జయప్రద సహితా కొత్తగా గాయని అవతారం ఎత్తారు. గతంలో సీతారాములు, రెండు హిందీ చిత్రాల్లో గజల్స్ పాడిన అనుభవముంది. ఇప్పుడామె సాయిబాబా భక్తిగీతాలు పాడుతున్నారు. వాసు మల్టీమీడియా అనే సంస్థ ఆడియో కంపెనీని ప్రారంభిస్తోంది. మొదటగా సాయిబాబా భక్తిగీతాల ఆడియో కేసెట్‌ను చేస్తుంది. ఇందులో మొత్తం 7 పాట లుంటాయి. ఒక పాట బాలసుబ్రహ్మణ్యం, మరో పాట హరిహరన్ పాడతారు. తక్కిన ఐదు పాటల్ని తాను పాడుతున్నట్లు జయప్రద చెప్పారు. ఈ కేసెట్ అమ్మకాల్లో వచ్చే లాభాల్లో 40శాతం జయప్రద ఛారిటబుల్ ట్రస్టుకు, 40శాతం షిరిడీ సాయిబాబా సంస్థానానికి ఇవ్వనున్నట్లు మల్టీమీడియా అధినేత వాసుదేవరావు చెప్పారు.

# స్నేహితుడా 'నువ్వే కావాలి'

రామోజీరావు నిర్మాతగా ఉషాకిరణ్ మూవీస్ సంస్థ రూపొందించిన "నువ్వేకావాలి" చిత్రం ముఖ్యమైన మూడు పాత్రల మీద ఆధారపడింది. అవి తరుణ్ (తరుణ్), మధు (రిచా), ప్రకాష్ (సాయికిరణ్) అనే పాత్రలు. ఈ మూడు పాత్రల్లో రామోజీరావు మూడు కొత్త ముఖాలను పరిచయం చేశాడు. నటి రోజారమణి కుమారుడు తరుణ్ బాలనటుడుగా "మనసు - మమతా" చిత్రంలో నటించాడు. అతను వయసులోను, అందంలోను, నటనలోను బాగా ఎదిగి ఈ చిత్రంలో తరుణ్‌గా హీరో పాత్రలో బాగా వెలిగిపోయాడు. మోడల్‌గా వున్న రిచా మాధవి పాత్రలో హీరోయిన్‌గా నటించింది. మాధవిని తల్లిదండ్రులు ముద్దుగా మధు అని పిలుస్తుంటారు. సినీ నేపథ్య గాయకుడు రామకృష్ణ కుమారుడుగా సాయికిరణ్ ప్రసాద్‌గా కాలేజి స్టూడెంటుగా, గాయకుడుగా మధును పెళ్లాడదలచుకున్న శ్రీమంతుడుగా నటించాడు. ఈ ముగ్గురు, కొత్త వాళ్లు రామోజీరావు కల్పించిన అవకాశాన్ని చక్కగా ఉపయోగించుకున్నారు. తరుణ్ కాలేజీ కుర్రాడుగా మధు స్నేహితుడుగా, ఆటపాటల్లో పాల్గొంటూ అల్లరి చేస్తూ, చలాకీగా కనిపిస్తూ, స్నేహ సాంగత్యం సరిహద్దుల్లో నడుపుతూ చక్కగా నటించాడు. రిచా

## చిత్రసమీక్ష

* * *

గ్రిద్దలూరు గోపాలరావు

తెలుగింటి ఆడపడుచులా, లక్ష్మీకళతో నవ్వుతూ, స్నేహంలోని మాధుర్యాన్ని, అనుబంధాన్ని అర్థాన్ని వినూత్నంగా వ్యాపింపచేసి, విశిష్టంగా ప్రదర్శించింది. సాయికిరణ్, సూర్యకిరణంలా తన పాత్రకు వెలుగును కలిగించాడు.

ఇద్దరు అబ్బాయిలు, ఒక అమ్మాయి వుండటంతో ఇది ఒక ముక్కోణపు ప్రేమ కథా చిత్రమనవచ్చు. కాని ఇది ప్రేమ కథ కాదు. ఇందులో ప్రేమకు స్థానం లేదు. స్నేహానికి ప్రముఖమైన స్థానం ఏర్పరచబడింది. కల్మషంలేని నిజమైన స్నేహం ఎంత బలంగా వుంటుందన్న విషయాన్ని కథలో విశదపరచబడింది.

తరుణ్, మధు ఒకే కాలనీలో ఎదురెదురు ఇళ్లల్లో వుంటారు. ఇద్దరూ ఒకే రోజున పుట్టారు. ఇద్దరూ ఒకే కాలేజీలో డిగ్రీ చదువుతుంటారు. చిన్ననాటి నుంచి ఒకరికొకరుగా స్నేహంగా వుంటారు. స్నేహ బంధంతో ఎదుగుతారు. ఇద్దరూ ఆడుతారు, పాడుతారు.ఒకరి మీద ఒకరు చిలిపి చేష్టలు చేస్తుంటారు, కాని వారిద్దరి మధ్య స్నేహం ఎప్పుడూ ఎక్కడా ప్రేమ పోకడలు పోదు. ఒక సన్నివేశంలో, మానసిక బలహీనతతో, మధును తానే పొందాలన్న ఆశ తరుణ్ హృదయంలో

తరువు 14వ పేజీలో

# వారఫలాలు

27-10-2000తేది నుండి 3-11-2000తేది వరకు వృషభంలో గురు, శనులు; మిధునంలో రాహువు; ధనుస్సులో కేతువు; తులలో రవి, బుధులు; వృశ్చికంలో శుక్రుడు; కన్యలో కుజుడు; తుల, వృశ్చిక, ధనుర్మకరాలలో చంద్రుడు.

### మేషం

(అశ్వని, భరణి, కృత్తిక 1వ పాదం)

కుటుంబ ఆర్థిక స్థితి బాగుంటుంది. విభేదాలు సర్దుకుంటాయి. జీవితంలో స్థిరత్వం కలుగుతుంది. ఆదాయం పెరుగుతుంది. స్థిరాస్తులు గాని, వాహనాలు కానీ కొనే అవకాశాలున్నాయి. అధికార వర్గంతో మాత్రం ఉద్యోగులు జాగ్రత్తగా మెలగాలి. విధి నిర్వహణలో జాగ్రత్త అవసరం. ఉద్యోగార్థులకు అవకాశాలు వస్తాయి. విద్యాప్రగతి బాగుంటుంది. రాజకీయ రంగంలో అనుకూల పరిస్థితులే ఉంటాయి.

### వృషభం

(కృత్తిక2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

వృత్తి, వ్యవసాయ రంగాలలో ఆదాయం అభివృద్ధి బాగుంటుంది. వ్యాపారంలో ఆర్థిక ఇబ్బందులుంటాయి. ఖర్చులు మాత్రం బాగా పెరుగుతాయి. ఉద్యోగాభివృద్ధి, నూతన ఉద్యోగ లాభం. శుభకార్యాలలో పాల్గొనడం జరుగుతుంది. గౌరవ ప్రతిష్ఠలు బాగుంటాయి. రావాల్సిన బాకీలు లభిస్తాయి. శుభవార్తలు వింటారు. పిల్లల విద్యావృద్ధి బాగుంటుంది.

### మిధునం

(మృగశిర3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

ఈ రాశి వారికి ఆదాయం, ఖర్చులు సమానంగా ఉంటాయి. పనులు నిదానంగా జరుగుతాయి. బంధుమిత్రులతో విభేదాలు రాకుండా చూసుకోవాలి. రావలసిన అప్పులు నిదానంగా లభిస్తాయి. ఉద్యోగులకు కార్యనిర్వహణలో ఆటంకాలు, కొత్త వారి పరిచయాలుంటాయి.

### కర్కాటకం

(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్లేషలు)

ఆర్థికంగా అభివృద్ధి దశలోకి ఉంటారు. స్థిరాస్తులు కొనడం, వివాదాలను పరిష్కరించుకొనడం జరుగుతుంది. ఆర్థికంగా పెరుగుదలకు అవకాశాలు వస్తాయి. పనులేవైనా విజయవంతం కాగలవు. నిలిచిపోయిన పనులకు కొనసాగిస్తారు. ఉద్యోగాభివృద్ధి, స్థానమార్పులు, బహుమతులు లభిస్తాయి. అధికారవర్గం మంచి సహకారం అందిస్తుంది. రాజకీయ ఆధిపత్యం బాగుంటుంది.

### సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

ఉద్యోగ సౌఖ్యం, అధికారవర్గ ఆదరణ బాగుంటుంది. కొన్ని మంచి నిర్ణయాలు తీసుకొంటారు. ఆర్థికస్థితి బాగుంటుంది. ఆదాయం పెరుగుతుంది. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాల వారికి పెట్టుబడి అవకాశాలు లభిస్తాయి. కృషి తీవ్రం చేస్తే అనుకున్న పనులు సవ్యంగా జరుగుతాయి. సాంకేతిక వర్గాల వారికి ఉద్యోగ, విదేశీయాన అవకాశాలు వస్తాయి. రాజకీయ స్థిరత్వం, పలుకుబడి పెరుగుతుంది. స్వల్ప ఉదరకోశ రుగ్మతలుంటాయి. కుటుంబ సభ్యుల అనుకూలత, విద్యావృద్ధి బాగుంటుంది. వాహనాలు, నూతన వస్తువులు కొనడం జరుగుతుంది.

### కన్య

(ఉత్తర2,3,4పాదాలు; హస్త;చిత్త1,2పాదాలు)

తొందరపాటు నిర్ణయాలు, కోపం ఎక్కువగా ఉంటుంది. అయితే అనుకున్న పనులు సక్రమంగా జరిగిపోతాయి. ఈ రాశి వారికి ఆదాయం బాగుంటుంది.

## పంచాంగం

తేది31మంగళ నాగచతుర్థి. తేది 1 బుధ ఆంధ్రరాష్ట్రావతరణము. ముహూర్తాలు ప్రశస్తమైనవి లేవు.

**అక్టోబర్ తిథులు**
**కార్తీక శుద్ధ**

తేది 28శని పాడ్యమి ప12.48గం.వ
తేది 29 ఆది విదియ ప1.00గం.వ
తేది 30సోమ తదియ ప1.55 గం.వ
తేది31మంగళ చతుర్థి ప3.10గం.వ

**నవంబరు తిథులు**

తేది1బుధ పంచమి సా 4.50 గం.వ
తేది 2 బేస్త షష్ఠి రా 6.50 గం.వ
తేది 3 శుక్ర సప్తమి రా8.50 గం.వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.

కుటుంబంలో మనస్పర్ధలు రావచ్చును. ఉన్నతగాదాలను పరిష్కరించుకోండి. అధికారులతో సఖ్యత, విధి నిర్వహణలో గుర్తింపు, గౌరవాలుంటాయి. సోదర వర్గం సహాయపడవచ్చును. ఉపయోగపడే ముఖ్యవార్తలు వింటారు. వస్తు, వాహన రిపేర్లుంటాయి. దూర ప్రయాణాలు కలుగవచ్చును.

### తుల

(చిత్త 3,4పాదాలు, స్వాతి, విశాఖ 1,2,3పాదాలు)

పనులకు ఆటంకాలు తప్పవు. తొందరపాటు, కోపం పెరుగుతుంది. కుటుంబ సభ్యులకు అనారోగ్యం, ఆర్థిక ఇబ్బందులు కలగడం, అప్పుచేయవలసి రావడం జరుగుతుంది. బంధువులతో విభేదాలు సర్దుకుంటాయి. రాజకీయ వర్గాలకు, ఆర్థికస్థితి సామాన్యంగా ఉంటుంది.

### వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఆర్థిక ఇబ్బందులుంటాయి. అవసరాలకు ఋణం చేయగలరు. దుబారా ఖర్చులు కూడా ఉంటాయి. వ్యాపార వర్గాలకు ఆదాయం తగ్గుతుంది. వివాదాలు, కేసులు పరిష్కారానికి వస్తాయి. ఉద్యోగులకు పని వత్తిడి పెరుగుతుంది. అధికారుల వల్ల కష్టపడతారు. విద్యార్థులకు కృషి, ప్రగతి బాగుంటుంది. రాజకీయ వర్గాలకు ఎదురు దెబ్బలు తగులవచ్చును.

### ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

కుటుంబ సభ్యులకు అనారోగ్యం కలుగవచ్చును. పనులు అనుకూలంగా జరుగుతాయి. ఆర్థికస్థితి బాగుంటుంది. వారం ప్రారంభంలో మానసికంగా ఆందోళన ఉంటుంది. స్థిరాస్తుల వల్ల ఆదాయం, వ్యాపార వృద్ధికి అవకాశాలు లభిస్తాయి. రాజకీయ పలుకుబడి ఉంటుంది. బంధుమిత్రుల రాకపోకలుంటాయి. కొత్త వస్తువులు కొంటారు. సాంకేతిక శాస్త్ర రంగాల వారికి ఉద్యోగ అవకాశాలు వస్తాయి. అధికారుల ఆదరణ తోడ్పాటుతో ఉద్యోగులు పనులు పూర్తి చేస్తారు. ఆకస్మిక ప్రయాణాలు కలుగవచ్చును.

### మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. ఆదాయం బాగుంటుంది. నిలబడిపోయిన పనులు మరలా కొనసాగుతాయి. బంధుమిత్రులతో స్వల్ప విభేదాలున్నా సమసిపోతాయి. పెట్టుబడి అవకాశాలుంటాయి. రావలసిన బాకీలు, ఋణాలు కొద్దిగా లభిస్తాయి. ఉద్యోగులకు విధి నిర్వహణలో ఆటంకాలుంటాయి. అధికారుల సహకారం కూడా బాగుంటుంది.

### కుంభం

(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

తెగిపోని సమస్యల కారణంగా ఋణాలు చేయవచ్చును. అనవసరమైన వివాదాలలో చిక్కుకుంటారు. జరుగుతున్న కేసులు, వ్యవహారాలు తీవ్రరూపం దాల్చవచ్చు. కాబట్టి జాగ్రత్తపడాలి. వృత్తి, వ్యాపార రంగాల వారికి ఆదాయం ఉంటుంది.

### మీనం

(పూర్వాభాద్ర 4పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

సన్నిహిత వర్గాలతో, బంధువులతో మనస్పర్ధలు రాకుండా జాగ్రత్తపడాలి. ఆరోగ్యం సరిగా ఉండదు. బలహీనత, గాయాలు తగలడం ఉంటుంది. ఆర్థికస్థితి సామాన్యంగా ఉంటుంది. స్థిరాస్తులపై ఆదాయం, బంధువుల రాకపోకలు జరుగుతాయి. ముఖ్యమైన పనులు వెనుకకు జరుపుకోండి.

# జనవాణి

3వ పేజీ కొరవ

తృప్తితో వ్యాపార వర్గాలున్నాయి.

నెల్లూరు కె.వి.చలమయ్య

## ఆత్మకూరు బస్టాండ్‌లో దగా

నెల్లూరు ఆత్మకూరు ఆర్టీసి బస్టాండ్‌లో పావుల వాళ్లు చేస్తున్న దగా ఇంతా అంతా కాదు. ఇక్కడ పల్లెటూళ్ల నుంచి జనం ఎక్కువగా వస్తుంటారు. ఈ బస్టాండ్‌లో పావుల వాళ్లు ఏదైనా వస్తువు కొనాలన్నా, కూల్‌డ్రింక్స్ త్రాగాలనుకొన్నా రేట్లు మనుషులను బట్టి చెబుతారు. త్రాగేసిన తర్వాత వాళ్లు చెప్పిన రేట్లు ఇవ్వకపోతే పెద్ద గొడవ చేస్తారు. పల్లెటూళ్ల జనం మారు మాట్లాడక ఈ మొత్తాలను ఇచ్చి వెళ్తున్నారు. ఆర్టీసి ఉన్నతాధికార్లు ఈ విషయాన్ని పరిశీలిస్తే బాగుంటుంది.

బుచ్చిరెడ్డిపాళెం ఎం.లావణ్య

## లింకురోడ్డు కావాలి

నెల్లూరు ఎస్వీజిఎస్ డిగ్రీ కాలేజికి వెళ్లాలంటే బాలాజీనగర్, పద్మావతి నగర్‌ల మీదుగా ఒక డొంక రోడ్డు, ఎన్టీఆర్ నగర్ నుంచి మరో మట్టి రోడ్డు వున్నాయి. ఇవి రెండూ బస్సులకు పనికిరావు. వానొస్తే సైకిళ్లకు, స్కూటర్లకు చివరికి పాదచారులకు కూడా పనికి రావడం లేదు. విద్యార్థులు ఇతరులు ఇక్కడికి రావాలంటే 'కాలుజారక' తప్పడం లేదు. ఎంతో పేరున్న ఈ కాలేజి కరస్పాండెంట్ టౌన్ ఎమ్మెల్యే గారు. ఆయన దయతో తారు రోడ్డును శాంక్షన్ చేయిస్తే బాగుంటుంది.

నెల్లూరు బాధిత విద్యార్థులు

## పొట్టిశ్రీరాములుకు మోక్షమెప్పుడు?

చెన్నై - కలకత్తా ఐదవ నెంబరు జాతీయ రహదారిపై కావలిటౌన్, పెండెం వారి సెంటర్‌లో పొట్టి శ్రీరాములు విగ్రహాన్ని సంవత్సరం క్రితం పెట్టారు. కాని ఆవిష్కరణకు మీనమేషాలు లెక్కపెడుతున్నారు. విగ్రహాన్ని మాజీ కలెక్టర్ శ్రీలక్ష్మి ఆవిష్కరిస్తానని ప్రచారం చేశారు. ఇంతలో అసెంబ్లీ, లోక్‌సభ ఎన్నికలొచ్చాయి. మునిసిపల్ ఎన్నికలు కూడా అయిపోయాయి. విగ్రహానికి మాత్రం మోక్షం రాలేదు.

చిట్టగుంట సి.హెచ్. సోలమన్‌రాజు

## రైల్వే పార్కును బాగుచేయండి

చిట్టగుంట రైల్వే ఇంగ్లీషు మీడియం హైస్కూల్ ప్రక్కనున్న రైల్వే పార్క్ గత 12 సంవత్సరాలుగా పిచ్చి మొక్కలతో, ముళ్ల చెట్లతో నిండిపోయి వుంది. పార్క్ ప్రక్కనేవున్న రైల్వే ఇన్‌స్టిట్యూట్‌లో ఏటా ఎన్నో వివాహ శుభకార్యాలు, మీటింగులు జరుగుతుంటాయి. ఇక్కడ భోజనం చేసిన విస్తర్లు, టిఫిన్ చేసిన ప్లేట్స్, గ్లాసులు తెచ్చి రైల్వే పార్కులో వేస్తున్నారు. ఇక్కడ చేరిన చెత్త దగ్గరకు పందులు, కుక్కలు చేరి నానా గలీజు చేస్తున్నాయి. నలుగురికి ఉపయోగపడే పార్కు శుభ్రంగా వుంచే బాధ్యత రైల్వే శాఖకు లేదా?

చిట్టగుంట రవి

## మాతృభాషను అమలు చేయరా?

తెలుగుదేశం పార్టీ అధికారంలోకి వచ్చాక గూడా ప్రభుత్వ కార్యక్రమాల్లో తెలుగు వాడకం పెరగలేదు. ఇప్పటికి అన్ని ప్రభుత్వ ఉత్తర్వులు (జిఓలు) ఇంగ్లీషులోనే వెలువడు తున్నాయి. అధికార్ల ఉత్తర, ప్రత్యుత్తరాలు ఇంగ్లీషులోనే కొనసాగిస్తున్నారు. కలెక్టర్, రెవిన్యూ ఆఫీసు, బస్సు డిపో, బస్ షెల్టర్, బ్రాంచి మేనేజర్, వాటర్‌షెడ్ పథకాలంటూ అన్నీ ఇంగ్లీషులోనే కొనసాగిస్తున్నారు. తమిళ నాడులో మాదిరి మాతృభాషపై రాష్ట్ర ప్రభుత్వానికి మమకారం లేదు.

చెన్నై ఎన్. రాంమోహన్‌రెడ్డి

# 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

ప్రయోజకత్వము, అడిగాగల వొషణాలు ఐక్యరాజ్య సమితి పర్యాయపదాలై పోయాయి.

గడచిన ఐదేండ్ల చరిత్రలోను - ఐక్య రాజ్యసమితి సాధించిన ఘనకార్యం ఒక్కటి కూడా లేదంటే దాని మను గడకు ఎంత నిష్ప్రయోజనమై పోయిందో విదితమవుతుంది.

ప్రపంచ దేశాల నడుమ పొడమిన స్పర్ధలను సరిదిద్దడంలో, ఒక ధర్మకర్తగా, ఒక న్యాయాధిపతిగా వ్యవహరించవలసిన ఐక్య రాజ్య సమితి ఆపనినైనా సక్యంగా సాగించలేకపోయింది. ఐక్య రాజ్య సమితికి నివేదింపబడిన సమస్యలలో, ఒక్క ఇండోనేషియా సమస్య తప్ప, తదితరాలు అన్నీకూడా ఆది అంతూలేని జాప్య జాడ్యానికి లోనై పోయివున్నాయి.

* దక్షిణ ఆఫ్రికా సమస్యకు ఇంత వరకు దిక్కు మొక్కు లేదు.
* కాశ్మీర్ సమస్య కాకులు చించిన విస్తరిఐ కూర్చొంది.
* బెర్లిన్ బుగ్గపై నీళ్లు చల్లిన కారణంగా ఆదిలోలోన రాజుకొంటున్నది.
* చైనా ప్రాతినిధ్యపు సమస్య చినికి చికని గాలివానమ సూచిస్తుంది.
* పాలస్తీనా సమస్య పట్ల జరిగిన పాతాలకు ఇక ఎప్పుడో ఒకప్పుడు ప్రాయశ్చిత్తం జరిగితీరుతుందని అరబ్ లోకం ఘోషిస్తున్నది.

### నెల్లూరు ముచ్చట్లు

బైట కమ్యూనిస్టు బిల వద్యిలోధిగా,
నఖ్యునట్లుగా అసంబ్లీ ముందు
రాఘువయ్యా వాణి రంజిల్లుటెలరా?
విశ్వాభివేమ, వినరరామా

### కాలమానం

గతవారంలో కురిసిన వర్షమేకానీ ఈ వారంలో ఏమీ లేదు. ఏట్లో నీళ్లు కూడా తగ్గిపోయినవి. వారధి మీద బండ్లు, మనుష్యులు నడుస్తున్నారు.

మొన్న కురిసిన వర్షం, సింగరాయ కొండ నుండి సూళ్లూరుపేట దక్షిణపు ఎల్లవరకు సముద్ర ప్రాంతంలో మాత్రం కురిసింది. పడమర భాగం పోను తగ్గిపోయింది.

### ఏ.సి.రెడ్డి రాజీనామా

రాజకీయ బాధితుల సలహా సంఘానికి ఏ.సి.రెడ్డి బెట్టిన రాజీనామా ఉపసంహరించుకోలేదు. 27తేది రాజకీయ బాధితుల సలహా సంఘం సమావేశమవుతున్నది.

. ఈ సంఘంలో వీరుండడం అత్యవసరం.

రాజకీయ బాధితులకు సంఘం వారు వీరిని అర్థించి ఎట్లయినా వుండేట్లు చేతురుగాక.

ఏ.సి.రెడ్డి గారు! ప్రజాకార్యాలల్లో అలగడమేమిటయ్యా.

### టౌన్ చోరీలు

అన్సారీ సాహెబ్ గారి ఇంట్లో 3-10-50తేదిన క్రొత్తగా పనికత్తెగా వచ్చిన అమీనాబీ అనే ఆమె అపహరించి పరారీ అయినట్లు మా పాఠకులు చదివేయున్నారు. ఆ మహా తల్లి పేరు, అమీనాబీ కాదు; అసలు పేరు ఖాసింబీ అట.

## నెల్లూరుసంగతులు

4వ పేజీ తరువాయి

కౌన్సిల్ సమావేశాల్లో మాట్లాడుతున్నారు. ఛైర్మన్‌ను పట్టుకొని మీ పాలన అసమర్థంగా వుందని తెల్చి చెప్పారాయన. స్వంత పార్టీ మనిషే అలా మాట్లాడడంతో ఆమె ముఖం కందగడ్డలా మారిపోయింది. వైస్ ఛైర్మన్ సందాని బాషా తనకొచ్చిన షోకాజ్ నోటీసుపై సుదీర్ఘ వివరణ ఇచ్చారు. ఈ వ్యవహారంలో నాకు సంబంధం లేకపోయినా నన్ను ముద్దాయిని చేశారు. పాదీ మంజిల్ ప్రారంభోత్సవానికి వెళ్లడమే నేను చేసిన తప్పా? పాదీ మంజిల్ ప్రారంభించమని తిరుపతి నుంచి నెల్లూరు మీదుగా నారాయణాద్రి ఎక్స్‌ప్రెస్‌లో వెళ్తున్న మంత్రిని అడగను రైలెక్కితే ఆయన తలుపు కూడా తీయలేదు. ఛైర్మన్ సమక్షంలోనే హైదరాబాద్‌కు ఫోన్ చేస్తే నెల్లూరుకు రానన్నారు. జిల్లా మంత్రి కదా అని ఆదాల ప్రభాకరరెడ్డిని అందరూ మునిసిపల్ కౌన్సిలర్లు వెళ్లి పిల్చాం. ఆయన తెలుగుదేశం వ్యక్తి. పాదీ మంజిల్ వుండేది కాంగ్రెస్ కౌన్సిలర్ వార్డులో; మంత్రికి మీకు పడనప్పుడు ఈ విషయంలో నన్ను బాధ్యుడ్ని చేస్తే ఎలాగన్నారు. ఛైర్మన్ ఛాంబర్‌కు రమేష్‌రెడ్డి రావడాన్ని నేను తప్పు పట్టడం లేదు. కౌన్సిలర్ 'అనిత ఛాంబర్‌కు వస్తే ఆమెను బయటకుపో' అని గద్దించడమేమిటి? మునిసిపల్ క్యాష్ బుక్ చెక్ బుక్స్ ఇతర వ్యక్తులు చూడడమేమిటన్నారు. కాని ఛైర్మన్‌పై ఎటువంటి ఆరోపణలు చేయలేదు వైస్ ఛైర్మన్. దీనికి జవాబుగా ఛైర్మన్ మాట్లాడుతూ వైస్ ఛైర్మన్ అధికారులను బెదిరించి పనులు చేసుకొంటున్నారు. ఈయనలా రూల్స్‌కు వ్యతిరేకంగా మాట్లాడే వ్యక్తి; అవసరాలకు తగ్గట్టు గొడుగు పట్టే వ్యక్తి మరొకరు లేరన్నారు. వాద ప్రతివాదనలతో అలసి సొలసిన సభ్యులకు ఛైర్మన్ 7 గంటల సమయంలో టీ బ్రేక్ ఇచ్చారు.

### ఎసిబి అధికారులే సర్దుకపోతే ఎలా?

కోతులన్నింటికి మూతులొక్కటే. నెల్లూరులో ఎసిబి అధికారుల తీరు కూడా ఈ విధంగానే ఉంది. ఈ శాఖలో పనిచేసేది గతంలో సివిల్ పోలీసులుగా పనిచేసినవారే. కాస్త నిజాయితీగా వున్న పోలీసులను ఎసిబికి పంపుతుంటారు. నెల్లూరు ట్రాఫిక్ పోలీసులు అవినీతి సామ్రాట్టులని ప్రత్యేకించి చెప్పక్కరలేదు. ప్రజలు చూస్తుండగానే లారీ లాపి డబ్బులు గుంజుతుంటారు. ఒక్కొక్క ట్రాఫిక్ కానిస్టేబుల్ అధమ సంపాదన రోజుకు 300 రూపాయలు. ఎస్‌ఐ అయితే 500 రూపాయలు సంపాదిస్తారు. ఒక్కొక్క ట్రాఫిక్ ఎస్‌ఐ, టౌన్ డిస్పీకి నెలకు 2 వేల రూపాయలు మామూలు సమర్పిస్తారు కాబట్టి వీరికి ఆయన ఆశీస్సులుంటాయి.

పాపం ఈ విషయాలన్నీ ఒక అమాయక లారీ డ్రైవర్‌కు తెలియవు. ఎసిబి పోలీసులు నిజాయితీపరులని మంగళవారం ఫిర్యాదు చేసి భంగపడ్డాడు. తమలపాకు లోడుతో చెన్నై వెళ్తున్న లారీని ఆత్మకూరు బస్టాండ్ వద్ద డ్యూటీలో వున్న ట్రాఫిక్ కానిస్టేబుల్ ఆపాడు. లంచం ఎందుకివ్వాలన్నందుకు డ్రైవర్, క్లీనర్‌లను చితకబాదారు. జేబులో డబ్బులు పెరుక్కోగా డ్రైవర్ ఈ విషయాన్ని వెళ్లి ఎసిబి అధికారులకు ఫిర్యాదు చేశారు. వారు వెంటనే స్పందించక ఫిర్యాదు ఇవ్వను వచ్చిన వారినే తిట్టి తరిమివేశారు. తాము చేసిన ఘనకార్యాన్ని ఎఎస్పీకి చెప్పి ట్రాఫిక్ కానిస్టేబిల్లను దారిలో పెట్టమన్నారట. ఎసిబి అధికారులే తమ డ్యూటీ నిఖార్సుగా నిర్వహించక సర్దుక పోతే ఎలా? ఎస్పీ గారు ట్రాఫిక్ పోలీసుల వ్యవహారాన్ని ఒకసారి పరిశీలించండి.

### షోకాజ్ నోటీసును నిరసిస్తూ ధర్నా

నెల్లూరు మునిసిపల్ వైస్ ఛైర్మన్ సందానిబాషాకు షోకాజ్ నోటీసు జారీ చేయడాన్ని నిరసిస్తూ కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలో 25తేదీ కలెక్టరేట్ వద్ద ధర్నా జరిగింది. ఈ సందర్భంగా కార్యకర్తలనుద్దేశించి నెల్లూరు ఎమ్మెల్యే వివేకానంద రెడ్డి మాట్లాడారు. పాదీ మంజిల్ ప్రారంభోత్సవానికి సందాని బాషాకు ఎటువంటి సంబంధం లేదు. కలెక్టర్ నుంచి వచ్చిన మంత్రి పర్యటన కార్యక్రమం మేరకే ప్రారంభోత్సవం జరిగింది. తెలుగుదేశం పార్టీకి చెందిన మంత్రి ప్రభాకరరెడ్డి ప్రారంభోత్సవం చేసిన పాదీమంజిల్‌పై అదే పార్టీకి చెందిన మునిసిపల్ ఛైర్మన్ ప్రభుత్వానికి ఫిర్యాదు చేయడం విడ్డూరంగా వుందన్నారు. డిసిసి అధ్యక్షుడు సి.వి.శేషారెడ్డి మాట్లాడుతూ ఈ వ్యవహారమై సమగ్ర విచారణ చేయిస్తే అసలు విషయాలు బయటకు వస్తాయన్నారు. రాపూరు ఎమ్మెల్యే రామనారాయణరెడ్డి మాట్లాడుతూ ఛైర్మన్, పాదీ మంజిల్ ప్రారంభోత్సవాన్ని తన రాజకీయ స్వప్రయోజనాలకు వాడుకొంటూ జిల్లా కలెక్టర్, కమీషనర్, మంత్రిని కించపరచేలా మాట్లాడుతుందన్నారు. వైస్ ఛైర్మన్ సందానిబాషా మాట్లాడుతూ పాదీ మంజిల్ ప్రారంభోత్సవం మునిసిపల్ కౌన్సిల్‌కు తెలియకుండా జరగలేదన్నారు. ధర్నాకు ముందు కాంగ్రెస్ కార్యకర్తలు ఎసి సెంటర్ నుంచి కలెక్టరేట్ వరకు ప్రదర్శన జరిపారు. పలువురు కౌన్సిలర్లతోపాటు ఆనం జయకుమార్ రెడ్డి, దేవకుమార్‌రెడ్డి, శ్రీధర్‌రెడ్డి, ప్రవీణ్‌కుమార్‌రెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### విద్యావ్యాపారం

ప్రభుత్వ విద్యా సంస్థల పరిస్థితి రోజురోజుకు దిగజారుతుంటే, ప్రైవేటు రంగంలో విద్యా వ్యాపారం దినదినాభివృద్ధి చెందుతుందని ఎబివిపి జాతీయ కార్యవర్గ సభ్యుడు జి.లక్ష్మణ్ చెప్పారు. 24తేది విలేఖరులతో మాట్లాడుతూ ఎల్‌కెజి నుంచి విద్యా వ్యాపారం ప్రారంభమవుతుంది. 500 రూపాయల నుంచి 50వేల వరకు పాఠశాలల్లో డొనేషన్లు వసూలు చేస్తున్నారు. ఇంటర్మీడియేట్ ఖరీదైన విద్యగా మారింది. ప్రభుత్వ జూనియర్ కాలేజీల్లో సీట్లు పెంచడం లేదు. ప్రైవేటు కాలేజీల్లో వేలాది మంది విద్యార్థులు చేరుతున్నా ప్రభుత్వం పట్టించు కోవడం లేదు. ప్రైవేట్ కాలేజీల్లో విద్య సామాన్య, మధ్యతరగతి ప్రజలకు అందుబాటులో వుండేలా ప్రభుత్వం చర్యలు తీసుకోవాలన్నారు.

### నెల్లూరు నేత్రదాతల సంస్థ రికార్డు

నెల్లూరులోని నేత్రదాతల సంస్థ ఇప్పటి వరకు నూటొక్క కళ్లను సేకరించి అరుదైన రికార్డును తన స్వంతం చేసుకొంది. నేత్రదాతల సంస్థ 1987 నవంబర్ 15తేదీ స్థాపించబడింది. 23తేది అరవిందనగర్‌లో వార్థక్యం కారణంగా మరణించిన సీలం లీలావతమ్మ నుంచి సేకరించిన రెండు కళ్లతో నూటొక్క కళ్లను సేకరించిన ఘనతను పొందింది. నేత్రదాతల సంస్థ ఈ స్థాయికి చేరడం వెనుక సంస్థ స్థాపకుడు తిక్కవరపు సుకుమార్‌రెడ్డి కృషి ఎంతైనా వుంది.

### పార్టీ పరువు బజారున పడవేయవద్దు

నెల్లూరు అసెంబ్లీ నియోజకవర్గ తెలుగుదేశం పార్టీ కార్యకర్తల సమావేశం స్టోన్‌హౌస్‌పేటలోని చుండూరు అమ్మణ్ణమ్మ కళ్యాణ మండపంలో 23తేది జరిగింది. సమావేశానికి ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి ముఖ్యఅతిధిగా విచ్చేసి మాట్లాడారు. పార్టీలో ఏదైనా అభిప్రాయభేదాలుంటే వాటిని సామరస్యంగా పరిష్కరించుకోవాలి. మాటిమాటికి అధిష్టాన వర్గానికి ఫిర్యాదులు చేసుకొని పార్టీ ప్రతిష్టను బజారుపాలు చేయవద్దన్నారు. పనిచేసే కార్యకర్తలను గుర్తించి పదవులివ్వాలని, మహిళా కార్యకర్తలను తప్పకుండా గుర్తించాలని పార్టీ పరిశీలకుడ్ని కోరారు. సమావేశంలో రమేష్‌రెడ్డి, వైవి.రామిరెడ్డి అనుచరులు వారి నాయకులకు మద్దతుగా నినాదాలు చేసి పరిశీలకుని చేత చీవాట్లు తిన్నారు. సమావేశానికి మునిసిపల్ ఛైర్మన్ అనూరాధ, జిల్లా పాలడైరీ అధ్యక్షుడు గోపాలకృష్ణయ్య చౌదరి, వై.వి.రామిరెడ్డి, పి.టి. రంగరాజన్, కోటలక్ష్మి కుమారి, అరిగెల కోదండరామయ్య తదితరులు హాజరయ్యారు.

### ఎఐవైఎఫ్ ప్రదర్శన

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పెంచిన ధరలకు వ్యతిరేకంగా 23తేది ఎఐవైఎఫ్ టౌన్‌లో పెద్ద ప్రదర్శనను నిర్వహించింది. ప్రదర్శన సిపిఐ ఆఫీసు నుంచి బయలుదేరి కలెక్టరేట్‌కు చేరుకొంది. ప్రదర్శననుద్దేశించి సిపిఐ జిల్లా కార్యదర్శి పములు దశరథరామయ్య మాట్లాడారు. సామాన్య, మధ్యతరగతి ప్రజలు తట్టుకోలేని విధంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ధరలు పెంచాయి. ప్రపంచ బ్యాంకు నిధులను అభివృద్ధి పనులకు వెచ్చించక వేరే పథకాలకు ముఖ్యమంత్రి దారి మళ్లిస్తున్నట్లు చెప్పారు. సిపిఐ నాయకులు రామచంద్రయ్య, వేదాచలం, రామారావు, జగదీష్‌ల తోపాటు ఎఐవైఎఫ్ నాయకులు బి. చెంచురెడ్డి, రాజేష్, పి. చంద్ర, సి.హెచ్. ప్రభాకర్ ధర్నాకు నాయకత్వం వహించారు.

## ఆగాలు

2వ పేజీ తరువాయి

30 మందితో రచ్చ - అధికార్లతో అసహనం ఇవన్నీ ఆమె స్వయంగా సృష్టించుకున్నవే. తన భర్త రమేష్‌రెడ్డికి తెలుగుదేశం పార్టీలో పూర్వపు రాజకీయ ప్రాభవాన్ని సంపాదించి పెట్టాలన్న ధ్యాసలో, దశ, దిశ తెలియకుండా ఆమె రాజకీయాలు నడుపుతున్నారు. ఓటేసిన ప్రజలకు సేవ చెయ్యాలన్న మాట మరచిపోయి రాజకీయ ప్రత్యర్థులను సాధించడమే పనిగా పెట్టుకొన్నారు. ఆమె ఇప్పటికైనా తన ధోరణి మార్చుకొని ప్రజాసమస్యల పరిష్కారంపై దృష్టి సారిస్తే పది మంది అభినందనలకు పాత్రురాలవుతుంది. అయితే, రమేష్‌రెడ్డి మనసు మార్చుకుంటే తప్ప ఇది సాధ్యం కాదు. ఈ రాజకీయ డ్రామాలకు రచన స్క్రీన్‌ప్లే, దర్శకత్వం ఆయనదే.



అంబేద్కర్ విగ్రహాన్ని శుభ్రపరుస్తున్న కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, నిలబడి చూస్తున్న వారిలో ఎమ్మెల్యే వివేకానంద రెడ్డి వున్నారు.

నెల్లూరుటౌన్‌లో గత నాలుగైదు నెలలుగా మంచినీటి సరఫరా పూర్తిగా కుంటుపడి పోయింది. రెండు మూడు రోజులకొకసారి కొన్ని వార్డుల్లో అరగంట సేపు కూడా కుళాయిల్లో నీళ్లు రావడం లేదు. అవి కూడా బురదనీళ్లే. మంచినీటి సరఫరాను పునరుద్ధరించి, ఇబ్బందుల్లో ఉన్న ప్రజలను ఆదుకుంటామన్న ధ్యాస పూర్తిగా లోపించింది. పట్టణంలో వీధుల్లో చెత్తాచెదారం పేరుకుపోయి, దుర్గంధంగా తయారైంది. డ్రైనేజి కాలువలను శుభ్రపరిచే వారే లేరు. మన నేతలకు జుట్లు పట్టుకొని కొట్టుకోవడంతోనే పుణ్యకాలం గడిచిపోతుంది. పేరుకుపోయిన డ్రైనేజి కాలువలు, దోమల ఉత్పత్తికి నిలయాలై ప్రజల పాలిట శాపంగా పరిణమించాయి. ఛైర్‌పర్సన్‌కు, కౌన్సిలర్లకు ఓట్లేసిన పాపానికి ప్రజలు ఈ అసౌకర్యాలను భరించాల్సి వస్తోంది.

## నీతిమంతులం

4వ పేజీ తరువాయి

జిల్లా ప్రభుత్వ ఆసుపత్రిలో రేడియాలజిస్ట్ లేరు. దీంతో సంబంధిత సర్జన్లు ఈ సర్టిఫికెట్ల మంజూరు చేయాలి. కాని వారు కూడా ఈ సర్టిఫికెట్లు ఇవ్వడం లేదు. ఒక్కొక్క స్టేషన్‌లో పది పదిహేను కేసులు సర్టిఫికెట్లు లేక పెండింగ్‌లో పడివున్నట్లు తెలుస్తుంది. ఆసుపత్రి అధికారులు మెడికో లీగల్ కేసులకు సంబంధించిన ఎక్స్‌రేలను తిరుపతి రుయా ఆసుపత్రికి పంపి అక్కడ రేడియాలజిస్ట్ చేత సంతకం పెట్టిస్తున్నట్లు తెలిసింది. ఈ పని కూడా రాజకీయ నాయకుల వత్తిడి వున్న కేసుల విషయంలోనే చేస్తున్నారట. ఈ సర్టిఫికెట్లను సకాలంలో వైద్యులు ఇవ్వక పోలీసులు ఛార్జిషీట్ పెట్టక ఎంతో మంది ముద్దాయిలు బెయిల్ దొరకక జైలులోనే మగ్గుతున్నారు. రేడియాలజిస్ట్ లేక ఆసుపత్రికి వచ్చే మామూలు రోగులు సైతం ఇబ్బందులు పడుతున్నారు. జిల్లా ఉన్నతాధికార్లు ఒక సమావేశం ఏర్పాటు చేసుకొని ఈ సమస్యను పరిష్కరించాల్సి వుంది.

## సినిమా

17వ పేజీ తరువాయి

నటినయ్యాను. ఎవరన్నా ఎక్స్‌పోజింగ్ అంటే మేకప్‌తీసి వెళ్లిపోవడానికి సిద్ధపడే దాన్ని. అయితే ప్రారంభదశలో నాకు హిట్స్ రావడం, ప్రేక్షకుల ఆదరణ లభించడంతో ఒక స్థానానికి చేరుకొన్నాను. చాలా మంది నన్ను మహా నటి సావిత్రి గారితో పోలుస్తుంటే తనలో ఆనందం అవధులు దాటుతుందని చెప్పింది.

### హీరోయిజమంటే...

నిజం చెప్పాలంటే కథలో భాగమై వుండి, అందులో వచ్చే సమస్య పరిష్కారానికి హేతుబద్ధంగా కృషిచేసే వాడే నిజమైన హీరో అన్నారు సుమన్. హీరోయిజం అంటే మూడు ఫైట్లు ఆరు డాన్స్‌లు కాదు. అయితే ఇప్పుడు ట్రెండ్ మారింది. టేకింగ్, టాపిక్ అంతా కొత్తగా వుండేలా జాగ్రత్త పడుతున్నారు. హీరో పాత్ర కథలో అంతర్భాగంగా ఉంటూ ఎలిమేట్ అయ్యేలా కృషి చేస్తున్నారు. ఈ క్రమంలో కొన్ని సందర్భాల్లో అసలు, పాటలు, ఫైట్లు లేకుండా చిత్రాలు రావడం ఆహ్వానించదగ్గ పరిణామమంటూ, ఇది సినిమా పరిశ్రమకు శుభసూచకమన్నారు.

Registered : RN 1156 / 57
No. A.P. / VJA / 52 / 8 / 2000



## భారత దేశ పాలనలో నెల్లూరీయుల పాత్రకిది నాంది - రాజకీయ రుజువర్తనుల భవితకిదే పునాది!

### ఢిల్లీస్థాయిలో నెల్లూరుకు గుర్తింపు తెచ్చిన వెంకయ్య నాయుడు గారికి సుస్వాగతం

# రండి... తరలి రండి... ఆశీర్వదించండి!



బి.జె.పి. అభ్యున్నతికి ఎనలేని కృషిచేసిన నాయకుడు
క్రమశిక్షణకు మారుపేరైన కార్యకర్త
నమ్మిన సిద్ధాంతానికి, నమ్ముకున్న పార్టీని వదలని నేత
స్నేహానికి ప్రాణం ఇచ్చే మిత్రుడు
పదవులకై పరితపించని నిస్వార్థపరుడు
జనం మేలు కోసం తపించే సేవకుడు
అసెంబ్లీ టైగర్‌గా సుప్రసిద్ధుడు
సింహపురి ముద్దుబిడ్డ

## శ్రీ యం. వెంకయ్య నాయుడు

**కేంద్ర గ్రామీణాభివృద్ధి మంత్రిగా నెల్లూరుకు విచ్చేస్తున్న సందర్భంలో మా స్వాగత సుమాంజలులు...**

సింహపురి చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించవలసిన శుభ సంఘటన ఇదే.

**31.10.2000 తేది ఉదయం 10.00 గంటలకు**

తన ఉన్నతికి, ఇప్పటి ఉన్నత మంత్రి పదవికీ
చిన్న నాడే పునాది వేసిన ఉదయగిరి ప్రజల
ఆశీస్సులు అందుకుంటారు.

**మధ్యాహ్నం 2.00 గంటలకు**

జన్మనిచ్చిన వెంకటాచలం (చవటపాలెం) గ్రామ ప్రజల
ఆశీర్వచనం స్వీకరించను కసుమూరు సందర్శిస్తారు.

**సాయంత్రం 5.00 గంటలకు**

నెల్లూరు ఏ.సి. సుబ్బారెడ్డి విగ్రహ కూడలిలో జరిగే
బహిరంగ సభలో నెల్లూరు పుర ప్రజలకు కృతజ్ఞతలు చెల్లిస్తారు

ఈ సభలన్నింటికీ జిల్లా ప్రజానీకం పెద్ద ఎత్తున
తరలి వచ్చి జయప్రదం చేయాలని మా విన్నపం.

**... ఎస్.వి. బాబుల్ రెడ్డి**

---

**ఆంధ్ర పాక శాస్త్రానికి పరాకాష్ఠ**

**అభిరుచి**

శాకాహార, మాంసాహార భోజనశాల ఎ/సి

ఎస్.డి. రోడ్, సికింద్రాబాద్ - 500 003, ఫోన్ : 7814545, 7811900